

చందమామ సంపుటి: 60 సెప్టెంబర్ 2007 సంచిక:9

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

### అమరవాణి

చెవులకు
శాస్త్రశ్రవణమే
గాని కుండలాలు
అలంకారం కావు;
చేతులకు దానం
అలంకారం గాని
కంకణం కాదు;
దయాగుణం
కలవారికి పరోపకారం
అలంకారం గాని
చందనపు పూతలు
కావు.







# ప్రతి ఉపాధ్యాయుడిలో ఒక కలాం!

విజ్ఞానశాస్త్రవేత్తగా ప్రభుత్వంలో వివిధ పదవులను సమర్థతో నిర్వహించిన డా. ఎ.పి.జె. అబ్దుల్ కలాం చివరగా తనకు ఎంతో ప్రీతిపాత్రమైన ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు. చెన్నయ్ అణ్ణావిశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా ఉన్నప్పుడే 2002లో దేశం కలాంను రాష్ట్రపతిగా ఎన్నుకున్నది. రాష్ట్రపతి పదవీ కాలం పూర్తికానున్న సమయంలో–మళ్ళీ విశ్వవిద్యాలయానికి వెళ్ళి విద్యార్థులకు పాఠాలు బోధించడమే తనకు చాలా ఇష్టమని ఆయన తన అభిమతాన్ని వెలిబుచ్చారు.

భారత దేశం గురుకుల వ్యవస్థకు పేరుగాంచింది. రాజకుమారులైనా, పేద విద్యార్థులైనా గురువు పాదాల వద్ద కూర్చుని విద్య నభ్యసించేవారు. ప్రపంచంలోనే అతి ప్రాచీనమైన తక్షశిల, నలంద విశ్వవిద్యాలయాలు మనదేశంలోనే వెలిశాయి. అక్కడ విద్యనభ్యసించడానికి దేశ విదేశాల నుంచి విద్యార్థులు వచ్చేవారు.

2020 నాటికి అన్నిరంగాలలో అభివృద్ధి చెందిన అగ్రరాజ్యంగా భారత దేశం రూపొందాలని అబ్దుల్ కలాం ఆకాంక్షిస్తున్నారు. ''మన దేశం అభివృద్ధి చెందడానికి ప్రధానమైన చోదక శక్తి ఏది?'' అని ఒక విద్యార్థి అడిగిన ప్రశ్నకు, ''మనం సాధించగలమన్న 'ఆత్మ విశ్వాసం.' అలాంటి అచంచల విశ్వాసంగల యాభైనాలుగు కోట్ల మంది పాతికేళ్ళకు లోబడిన యువతీయువకులు గల మన దేశం 2020 నాటికి అభివృద్ధి చెందిన దేశంగా రూపొందడాన్ని ఏ శక్తీ అడ్డుకోజాలదు,'' అని ఆయన సమాధానం ఇచ్చారు.

'ప్రజల రాష్ట్రపతి'గా మన్ననలందుకున్న డా. అబ్దుల్ కలాంకు మన దేశంలోని ఉపాధ్యాయ సోదరులు, విద్యార్థులు మళ్ళీ విద్యాబోధనకు సాదర స్వాగతం పలుకుతున్నారు. మాజీ రాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినం సెప్టెంబర్ 5న ఉపాధ్యాయ దినోత్సవం జరుపుకుంటూన్న శుభసందర్భంలో–ప్రతి ఉపాధ్యాయుడూ, ఉపాధ్యాయినీ, తమలో ఉన్న కలాంను వెలికి తీసుకురావాలి. ప్రతి విద్యార్థిలో జాతీయ స్ఫూర్తిని ఉద్దీపింప జేయాలి!

సంపాదకుడు : **విశ్వం**







చందమామ

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.150.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్
ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.

**ఉత్తమ లేఖకు బహుమతి!**
అక్టోబర్ సంచిక నుంచి 'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం. -సం.

**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
**CHANDAMAMA INDIA LIMITED**
**82, Defence Officers Colony**
**Ekkatuthangal,**
**Chennai - 600 032**
**E-mail :**
**subscription@chandamama.org**



# పాఠకుల లేఖలు

చందమామ వజ్రోత్సవం పూర్తిచేసుకుని ముందుకు సాగుతున్నందుకు అభినందనలు. నేను మొదటి నుంచీ విడువకుండా చదివే 'పెద్ద' పాఠకురాలిని. జూలై సంచికలోని బేతాళ కథ 'సంజీవనీ మంత్రం'తో సహా అన్ని కథలూ, శీర్షికలూ బావున్నాయి. సంపాద కీయం 'విజయపథంలో ఆశయదీపం' ఎంతో బావుంది. నాలాంటి పెద్దవాళ్ళకు ఇంట్లో కూర్చుని చదువుకోవడానికి ఎన్నో విశేషాలు మీరు ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు. చందమామ అందరి హృదయాలలో అద్భుత జ్యోతిలా వెలుగుతుంది. ముఖ్యంగా చిన్నారి బాలల మనస్సులలో చిరునవ్వులు వెదజల్లుతుంది. చందమామ ఇంకా కొత్త పాతల మేలు కలయికగా ప్రజ్వరిల్లాలని ఆకాంక్షిస్తున్నాను. -ఎ.ఎస్. లీలావతి, విజయవాడ

చందమామ అంటేనే చిన్నాపెద్దా తేడా లేకుండా గుర్తుకు వచ్చేవి చక్కటి కథలు, చాలా ముద్దుగా అందంగా ఉండే బొమ్మలు. దయచేసి బొమ్మలను కథలకు అనుగుణంగా సీనియర్ల చేత వేయించండి. పేజీ క్వాలిటీ పెంచండి. ధర ఎంతయినా భరిస్తాం.
-తరుణ్‌కుమార్, హిమబిందు, శ్రీదేవి, రవి, సుష్మ-హైదరాబాదు

గత ఐదు సంవత్సరాల నుంచి చందమామ కథలు చదువుతున్నాను. అప్పటి నుంచి చందమామ అభిమానినయ్యాను. చందమామ కథల పుస్తకం తీసుకురావాలన్న ఆలోచన వచ్చిన పెద్దల నుంచి కథలు, బొమ్మలు అందించే ప్రతి ఒక్కరికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. మీ అందరికీ దేవుడు ఆయురారోగ్యాలు ఇవ్వాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

-పి. సామ్యుల్, కె. వడ్డిపాలెం, నెల్లూరు జిల్లా - 524 322

అరవై సంవత్సరాలు పూర్తి చేసుకున్న చందమామకు అభినందనలు. ఎక్కువ పేజీలతో బహుసుందరంగా తయారై మా ముందుకు వచ్చిన జన్మదిన సంచికను చూసి ఎంతో సంతోషించాము.

-జి. మురళీధర్, మచిలీపట్నం-521 001



# దివాణం నౌకరీ

రామతీర్థంలోని శాల్మలుడికి చిన్నప్పుడే తల్లి దండ్రులు పోయారు. ఊళ్ళోవాళ్ళు చెప్పిన పనులు చేసుకుని పొట్టపోసుకుంటూ, పూజారి ఇంట పనులు చేసి నాలుగు అక్షరాలు నేర్చుకుని, యుక్తవయస్కుడయ్యే సరికి అందరి చేతా తెలివైనవాడని పేరు తెచ్చుకున్నాడు. జమీందారు దివాణంలో ఏదైనా ఉద్యోగం సంపాయించాలని అతడు రాఘవపురం వచ్చాడు. ఆ ఊరి గ్రామాధికారిని కలుసుకుని తన పరిస్థితిని వివరించి సాయం అర్థించాడు.

''ఈ క్షణం వరకు ముక్కూమొహం తెలియనివాడివి. నిన్ను గురించి జమీందారుకు నేనేమని చెప్పేది? తీరా నేను చెబితే జమీందారు గారు నామీదే విరుచుకు పడగలరు. వెళ్ళు, వెళ్ళు,'' అని కసిరి పంపాడు గ్రామాధికారి.

ఆశాభంగంతో వెనుదిరిగిన శాల్మలుడికి అదే దారిలో ఒక అరుగుపై కూర్చుని, జంద్యాలు వడుకుతూన్న సిద్ధాంతి కంట బడడంతో ఆగి, ఆయనకు తన ఉద్యోగం విషయం చెప్పాడు. ''జమీందారు వద్దపని చేయడానికి ఎంతో అనుభవం ఉండాలి. అసలు ఈ ఊళ్ళో నీకు పని ఇచ్చేదెవరని?'' అంటూ హేళన చేశాడు సిద్ధాంతి.

అక్కడి నుంచి బయలుదేరుతూన్న శాల్మలుణ్ణి, భైరవశెట్టి అనే నేతి వ్యాపారి చూశాడు. ''బాబూ, ఈ రోజు కార్తీక సోమవారం. శివాలయం దగ్గరికి ఈ నేతి కుండను మోసుకు వెళ్ళాలి. చెయ్యగలవా?'' అని అతడు చెప్పడమే తడవుగా శాల్మలుడు నేతికుండను భుజంపైకి ఎత్తుకున్నాడు.

శాల్మలుడలా నేతికుండను దింపిన మరుక్షణం నేతిని కొనడానికి భక్తులు మూగారు. ఈ రద్దీలో తను ఒంటరిగా చూసుకోలేనని సాయంత్రందాకా తన వెంట ఉండి వ్యాపారం

కె.కె. రఘునందన



చూడమని భైరవశెట్టి చెప్పగానే సరే నన్నాడు శాల్మలుడు. కుండలోని నెయ్యి మధ్యాహ్నానికే అమ్ముడైపోయింది. భైరవశెట్టి చాలా సంతోషించి, శాల్మలుడికి కూలీ డబ్బులిచ్చి, ''ఎంతో అనుభవం ఉన్నవాడిలా సాయపడ్డావు. మా పనివాడు రేపు వచ్చేస్తాడు. లేకపోతే నిన్నే ఏకంగా పెట్టుకునేవాణ్ణి,'' అంటూ పంపేశాడు.

మరునాడు శాల్మలుడు జమీందారు దివాణానికి వెళ్ళాడు. ఇద్దరు పనివాళ్ళు అడ్డగించి వివరాలు అడిగి అతడి కోరిక వినగానే, ''ఇప్పుడే పనివాడొకడు పీంగాణిపాత్ర పగలగొట్టాడని నానా తిట్లు తిన్నాడు. ఈ సమయంలో వెళితే, నీ పని అంతే! వెళ్ళు, వెళ్ళు,'' అని తిప్పి పంపేశారు.

దిగులుగా వెనుదిరిగిన శాల్మలుడికి మళ్ళీ భైరవశెట్టి తారసపడి, అతని దిగులుకు కారణం అడిగాడు. శాల్మలుడు ఆ ఊరు వచ్చినప్పటి నుంచి ఎదురైన అనుభవాలను ఏకరువు పెట్టాడు. అంతా విన్న భైరవశెట్టి, ''నౌకర్లు ఆయన గురించి ఎందుకలా చెప్పారో గాని, జమీందారుకు స్వతహాగా చాలా మంచి మనసు.దేనికీ మరోసారి ప్రయత్నించి చూడు,'' అన్నాడు.

ఆ మాట వినగానే శాల్మలుడికి ఎలాగైనా జమీందారు దివాణంలో నౌకరీ సాధించాలన్న పట్టుదలపెరిగింది.

అంతలో భైరవశెట్టి, ''అసలు విషయం చెప్పడం మరిచాను. కోనవరంలో శివాలయం కట్టారు. ప్రతిష్ఠనాడు నేతి అమ్మకానికి మరి కొందరి అవసరమున్నది. ఈ రోజు నువ్వు కూడా వెళతావా?'' అని అడిగాడు.

శాల్మలుడు మారు మాట్లాడకుండా నేతి కుండను మోసుకుని వెళ్ళాడు. అమ్మకం అయ్యాక తిరిగి వచ్చి, లెక్కంతా అప్పగించి, ''ఈ నేతిని అంతమంది కొని దేవుడికి ఇస్తున్నారు కదా? ఎందుకని?'' అని తన అనుమానాన్ని బయటపెట్టాడు.

''మనం ఏదయినా కోరుకుని వారానికి ఓసారి దేవుడికి నేతితో అభిషేకం చెయ్యిస్తే, మన కోరిక త్వరగా తీరుతుందని భక్తుల విశ్వాసం,'' అన్నాడు భైరవశెట్టి.

ఆ మాట వినగానే శాల్మలుడు అప్పుడే దివాణంలో నౌకరీ లభించినంత సంబరపడిపోయాడు. అది మొదలు కష్టపడి కూలిపని చేసిన డబ్బులతో నేతినికొని శివుడికి అభిషేకం చేయించసాగాడు.

ఒక నెలగడిచాక శాల్మలుడు ధైర్యంచేసి మళ్ళీ జమీందారు దివాణానికి వెళ్ళాడు. నౌకర్లు అడ్డగిస్తే, ''ఈ సారయినా నన్ను జమీందారును చూడనివ్వండి. నాకు నౌకరీ కావాలి,'' అన్నాడు.

''పిచ్చివాడా, నిన్నే ఉన్న ఇద్దరు నౌకర్ల ఉద్యోగాలు ఊడాయి. నిష్కారణంగా ఇంటికి పంపేశారు. అలావుంది జమీందారు వ్యవహారం,'' అని వెనక్కు పంపేశారు నౌకర్లు.

అప్పటికీ శాల్మలుడికి నౌకరీ మీద ఆశ పోలేదు. ఎప్పటిలాగే తన కోర్కెను తీర్చమని శివుణ్ణి ప్రార్థిస్తూ నేతితో అభిషేకం చేయిస్తూనే ఉన్నాడు. ఒకసారి నెయ్యి కొనడానికి తన కొట్టుకువచ్చిన శాల్మలుడితో, భైరవశెట్టి, ''నాకు పోటీగా నేతి వ్యాపారంగాని చేయటం లేదుకదా?'' అని హాస్యమాడాడు.

శాల్మలుడు బదులుగా నవ్వి విషయం వివరించాడు.

''త్వరలోనే నీ కోరిక నెరవేరగలదని ఆశిస్తున్నాను. అన్నట్టు, జమీందారుకు ఈ మధ్య ఏదో తీరని జబ్బు చేసిందని విన్నాను,'' అని చెప్పాడు భైరవశెట్టి.

అది విన్న శాల్మలుడికి మనసు నిలువ లేదు. ఆ రాత్రంతా జమీందారు అనారోగ్యం గురించి తీవ్రంగా విచారించాడు. మరునాడు ఉదయం శివాలయానికి వెళ్ళి, జమీందారు త్వరగా కోలుకోవాలని మనసారా ప్రార్థించి నేతి అభిషేకం చేయించాడు.

''ఇన్నాళ్ళు దివాణంలో నౌకరీ దొరకాలని దేవుడికి అభిషేకం చేయించినవాడివి, ఇప్పుడేమో జమీందారు ఆరోగ్యం కోసం చేయిస్తున్నావేమిటి?'' అని అడిగాడు పూజారి.



"నాకు ఉద్యోగం ఇచ్చే యజమానే అనారోగ్యం పాలయితే ఇక నేనెవరిని నౌకరీ అడగగలను? అందుకే ఆయన ఆరోగ్యంగా ఉండాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను," అన్నాడు శాల్మలుడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకే జమీందారు పూర్తిగా కోలుకున్నాడు. శివాలయంలో మృత్యుంజయ హోమం, అభిషేకం చేయించాలనుకుని వాటి ఏర్పాట్ల కోసం పూజారిని పిలిపించాడు. అప్పుడు పూజారి, "అయ్యా, స్వస్థత సమకూరాక తమరు ఇప్పుడు శివుడికి అభిషేకం చేయించాలనుకుంటున్నారు. అయితే, తమరు మంచం పట్టారని తెలిసిన మరుక్షణం నుంచే, మీకు ఆరోగ్యం చేకూరాలని ప్రార్థిస్తూ, నేతి అభిషేకం చేయిస్తున్నాడు ఒక యువకుడు," అంటూ శాల్మలుడి గురించి వివరించాడు.

ఆ మాట వినగానే జమీందారు కళ్ళు చెమ్మగిల్లాయి. అజ్ఞాతంగా తన మంచిని కోరుకుంటూన్న శాల్మలుణ్ణి చూడాలనుకుని పూజారి ద్వారా కబురు చేశాడు.

అతడు రాగానే, స్వార్థం కొద్దీ మరెవ్వరినీ తన దరిదాపులకు రానివ్వకుండా అడ్డుకుంటూన్న దివాణంలోని కొందరు నౌకర్ల దుర్మార్గం బయటపడింది. వారి మీద కఠిన చర్యలు తీసుకున్నాడు.

తన వద్ద పనిచేయాలన్న పట్టుదలతో, తనను ఎంతగానో అభిమానించి, తన క్షేమం కాంక్షించిన శాల్మలుడికి దివాణంలో తగిన ఉద్యోగం ఇచ్చి ఆదరించాడు.

ఆ రోజు సాయంత్రం శాల్మలుడు శివాలయానికి వెళ్ళాడు. అతన్ని చూసిన పూజారి, "చూశావా నాయనా! నువ్వు నీ కోసం అభిషేకం చేయించినన్నాళ్ళు శివుడు ఊరుకున్నాడు. జమీందారు ఆరోగ్యం కోసం ప్రార్థించిన వెంటనే నీ మొర ఆలకించాడు. అటు జమీందారు ఆరోగ్యం కుదుట పడడంతో పాటు, ఇటు నీకు నౌకరీ కూడా దొరికింది. ఎదుటివారి క్షేమంలోనే మన క్షేమంకూడా ఇమిడి ఉందని గ్రహించి, భగవద్భక్తితో మసలుకోవడమే అందరికీ మంచిది," అని చెప్పి ఆశీర్వదించాడు.





# వ్యాపార బాధ్యత!

సింగవరంలో ధాన్యం వ్యాపారం చేస్తున్న నాంచారయ్య బాగా సంపాదిస్తున్నాడు. దాన గుణం, దైవభక్తి గల ఆయన ఒక ధర్మసత్రం, రామాలయం నిర్మించి; సత్రంలో పేదలకు అన్నదానం చేయడం, రామాలయంలో తరచూ హరికథలు చెప్పడం ఏర్పాటు చేశాడు.

ఒకనాటి రాత్రి ఆయన భోజనం చేస్తూం డగా, భార్య తాయారమ్మ, ''చేతికి అంది వచ్చిన ముగ్గురు కొడుకులు ఉన్నారు. ఇంకా మీరే వ్యాపారమంతా తలకెత్తుకుని అవస్థ పడడం దేనికి? ముగ్గురిలో ఒకరికి వ్యాపారం అప్పగించవచ్చుకదా?'' అని అడిగింది.

''నేనూ అదే ఆలోచనలో ఉన్నాను. ముగ్గు రిలో ఎవరికి అప్పగిస్తే మన ఆస్తిపాస్తులకు, గౌరవమర్యాదలకు భద్రత ఉంటుందా అని ఆలోచిస్తున్నాను,'' అన్నాడు నాంచారయ్య.

''దానికెందుకు అంత పెద్ద ఆలోచన? అబ్బాయిలు ముగ్గురూ మంచివాళ్ళే కదా. ఎవరికి అప్పగించినా నిక్షేపంగా నిర్వహించ గలరు,'' అన్నది తాయారమ్మ.

''కన్న బిడ్డల మీది మమకారం కొద్దీ అలా అంటున్నావేగాని, వ్యాపారానికి ఒక్క మంచి తనం మాత్రమే చాలదు. తెలివితేటలతో పాటు చేసే వ్యాపారం పట్ల ఆసక్తి ఉండాలి. అది మన ముగ్గురు కొడుకులలో ఎవరికి ఉన్నదో తెలుసు కోవడానికి చిన్న పరీక్షపెడతాను. వారి సమర్థ తను నువ్వే చూద్దువుగాని,'' అన్నాడు.

మరునాడు నాంచారయ్య ముగ్గురు కొడు కులనూ చేరబిలిచి, ముగ్గురికీ తలా ఒక రూపాయి నాణెం ఇచ్చి, ''ఈ రూపాయితో సాయంకాలంలోగా ఏదైనా ఒక మంచి పని చేసిరండి. దాంతో మీ దక్షత ఏపాటిదో బయట పడుతుంది,'' అని చెప్పి అంగడికి వెళ్ళాడు.

సాయంకాలం ఇంటికి వచ్చిన నాంచా రయ్య ముగ్గురు కొడుకులూ తన కోసం ఎదురు చూస్తూండడం గమనించాడు.

కోలపల్లి ఈశ్వర్

ఆయనమొదట పెద్దవాడైన సోమశేఖరాన్ని పిలిచి, ''నువ్వు నేనిచ్చిన రూపాయి నాణెంతో ఏ మంచి పని చేశావు?'' అని అడిగాడు.

''రామాలయం దగ్గర ఆకలితో అలమటి స్తూన్న వృద్ధురాలికి దానిని ఇచ్చాను,'' అన్నాడు సోమశేఖరం. నాంచారయ్య చిన్నగా నవ్వుతూ, నువ్వేం చేశావు అన్నట్టు రెండవ కొడుకు రామబ్రహ్మం కేసి చూశాడు.

''మన వ్యాపారం అభివృద్ధి చెందాలని గుడిలో పూజ చేయించి, రూపాయిని పూజారి పళ్ళెంలో వేశాను,'' అన్నాడు రామబ్రహ్మం.

నాంచారయ్య అదే చిరునవ్వుతో చిన్న కొడుకు నారాయణ కేసి చూస్తూ, ''నువ్వేం చేశావు?'' అని అడిగాడు.

నారాయణ మౌనంగా తన జేబులో నుంచి రూపాయి నాణెం తీసి తండ్రి ముందుంచాడు.

''రూపాయిని ఖర్చు చేయకుండా అలాగే పొదుపు చేశావా?'' అని అడిగాడు నాంచారయ్య.

''లేదు నాన్నా! మీరిచ్చిన రూపాయితో తోట దగ్గరికి వెళ్ళి నాలుగు నిమ్మకాయలు కొన్నాను. అంగడి వీధిలో ఒక అరుగు పక్కన కూర్చుని, ఇవి చాలా ప్రశస్తమైన నిమ్మకాయలని చెప్పి వాటిని రెండు రూపాయలకు అమ్మాను. లాభంగా వచ్చిన రూపాయితో అర్ధ రూపాయికి అటుకులు కొని, ఆకలితో ఉన్న పిల్లవాడికిచ్చాను. అర్ధ రూపాయిని అందరినీ చల్లగా చూడమని దేవుడి హుండీలో వేశాను. మిగిలిన అసలు రూపాయిని మీకిచ్చాను,'' అన్నాడు నారాయణ నెమ్మదిగా.

అతడి తెలివితేటలకూ, దయాగుణానికీ ముగ్ధుడైన నాంచారయ్య అతనికే తన వ్యాపారాన్ని అప్పగించాలని నిర్ణయించాడు. ఇద్దరి కొడుకుల కేసి తిరిగి, ''ఏమంచి పని చెయ్యాలన్నా డబ్బు అవసరం. వ్యాపారానికి అది మరీ ముఖ్యం. అందువల్ల వ్యాపారం చేయదల చినవాడు ముందు చేయవలసింది లాభం సంపాదించడం. నారాయణ ఆ పని చేశాడు. డబ్బు సంపాదించాక దానధర్మాలు. మీలో ఒకరు మన ధర్మసత్రాన్నీ, మరొకరు రామాలయం బాధ్యతలూ చూసుకుంటూ, తమ్ముడికి వ్యాపారంలో సహకరించండి,'' అన్నాడు.

అన్నలిద్దరూ అందుకు సంతోషంగా సమ్మతించారు. భర్త నిర్ణయానికి భార్య తాయారమ్మ ఎంతోగానో సంతోషించింది.






# రాకాసిలోయ

## 25

[కేశవుడూ అతడి స్నేహితుల నుంచి, రెక్కల మనుషులు తప్పించుకుని పారిపోయారు. అదే సమయంలో శ్వానకర్ణి అనే మరొక భయంకరమైన అడవిజాతి వాడి ముఠా, వాళ్ళను చుట్టుముట్టారు. జయమల్లు శ్వానకర్ణికీ—తను సహాయం చేస్తానన్న బిడాలికీ తప్పక రాజీ కుదిర్చేందుకు ఒప్పుకుని; బిడాలి అనుచరుణ్ణొకణ్ణి, వాళ్ళ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు పంపాడు. -తరవాత]

తమ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు బయలుదేరిన బిడాలి అనుచరుడికి, కొంత దూరం వెళ్ళేసరికి దారిలో బిడాలి మరి పది మంది తన ముఠావాళ్ళతో ఎదురయ్యాడు. వాళ్ళందరి దగ్గరా రకరకాల ఆయుధాలు న్నాయి. అందరూ చెట్లచాటునపొంచి నడుస్తూ మెల్లమెల్లగా ముందుకు వస్తున్నారు. బిడాలి తన అనుచరుణ్ణిచూసి, "ఎందుకలా పరిగెత్తుతున్నావు? ఏం జరిగింది?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

బిడాలి అనుచరుడు తను కేశవుడూ వాళ్ళ చేత ఎలా రక్షించబడ్డాడో, రెక్కల మనుషులు ఏ విధంగా వాళ్ళ బాణాల దెబ్బకు అందకుండా పారిపోయారో, చెప్పబోయే సరికి, బిడాలి చేయెత్తి అతణ్ణి వారిస్తూ, "ఆ సంగతంతా, నీ వెంట వున్నవాడు వచ్చి ముందే చెప్పాడు. ఇప్పుడు నే నడిగేది; మిమ్మల్ని ఆ శ్వానకర్ణి దుర్మార్గుడి ముఠావాళ్ళు చుట్టుముట్టిన తరవాత జరిగిందేమిటని," అన్నాడు కోపంగా.

'చందమామ'



బిడాలి అనుచరుడు శ్వానకర్ణి ముఠా నివసించే కొండ గుహదగ్గిర జరిగిన సంభాషణా, జయమల్లు చేసిన వాగ్దానం సంగతీ క్లుప్తంగా చెప్పి, "వాళ్ళ మూలపురుషుడి రాతి గద తెచ్చి ఇస్తే, తను మనతో శత్రుత్వం మానుకుంటానని శ్వానకర్ణి చెప్పాడు. జయమల్లు ఆ రాతి గద తెమ్మని నీకు చెప్పవలసిందిగా నన్ను పంపాడు," అన్నాడు.

రాతి గద పేరు వింటూనే బిడాలి గతుక్కుమని, తన అనుచురులకేసి కళ్ళెర్ర చేస్తూ చూశాడు. వాళ్ళంతా తలలు వంచుకున్నారు. బిడాలి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, "నేను ముందే చెప్పాను. మీలో ఏ ఒక్కరికీ బుద్ధీ జ్ఞానం వున్నట్టు లేదు. మీరంతా కలిసి, ఆ భాగ్మారాను ప్రోత్సహించి, చేయించినవెధవ పనితో ఎన్ని చిక్కులు వచ్చినయ్యో చూశారా? బుద్ధిలేని మీ మూర్ఖపు పనివల్ల నాకు తల నొప్పి. ఇప్పుడా రాతి గద ఎక్కడ వున్నదని వాళ్ళకు చెప్పేట్టు?" అన్నాడు.

"చాతనైతే, వాళ్ళ పూర్వీకుడి గదను ఆ శ్వానకర్ణినే తెచ్చుకోమనండి. ఆ రాతి ముక్క కోసం ఎంతో ధైర్యశాలీ, బలశాలీ అయిన మనవాడొకడు చచ్చాడు," అన్నాడు బిడాలి అనుచరుల్లో ఒకడు.

బిడాలి కోపావేశంతో, ఈటెను బలంగా ఒకసారి నేలకు తాటించి, "వాడికెంత ధైర్యం బలంవుంటే మాత్రం, నిప్పులు కక్కే సింహాన్ని చంపగలడా? ఆ ప్రయత్నంలో వాడూ చచ్చాడు, గదా పోయింది," అంటూ ఒక్క క్షణకాలం ఆలోచించి, "ఇక నడవండి. జరిగిందేదో ఆ శ్వానకర్ణికే చెబుదాం," అన్నాడు.

"మనం పదిమంది కంటె ఎక్కువలేం. శత్రువు గుహకు ఎలా వెళ్ళటం? వాళ్ళు మన మీది కొస్తే, మనం ఏమయ్యేట్టు?" అన్నాడొకడు బిడాలి కేసి చూస్తూ.

"ఇదీ మీ ధైర్యం! ఇంత ప్రాణ భయం వున్నవాళ్ళు, ఆ రాతి గద జోలికెందుకు పోయారు? సరే. అదంతా ఇప్పుడు తవ్వి లాభంలేదు. శ్వానకర్ణి నుంచి మనకెలాంటి ప్రమాదం రాకుండా, ఆ కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ రక్షించగలరు. వాళ్ళ చేతుల్లో వున్న కొత్తరకం ఆయుధాలు చూశారుగదా. వాటిదెబ్బకు తిరుగులేదు," అన్నాడు బిడాలి.

బిడాలి తన ముఠావాళ్ళతో కేశవుణ్ణీ అతడి స్నేహితుల్నీ సమీపించేసరికి, అక్కడ వాళ్ళు శ్వానకర్ణితో మాట్లాడుతున్నారు. బిడాలి రావటం చూస్తూనే, శ్వానకర్ణి కోపంతో ముక్కుపుటాలు ఎగరవేస్తూ, "చూశారా! వాళ్ళు ఆ రాతి గద

తేవటం లేదు. వాళ్ళతో ఇంక రాజీమాట లేమిటి?'' అన్నాడు కోపంగా.

జయమల్లు, బిడాలి కేసి తిరిగి, ''ఏం బిడాలీ! ఆ రాతి గద వెంట తెమ్మని నీ అను చరుడితో కబురు చేశానే. ఎందుకని తేలేదు? శ్వానకర్ణితో శత్రుత్వం ఇంకా పొడిగించాలని వున్నదా?'' అని అడిగాడు.

''నా కెవరితోనూ శత్రుత్వం నెరపాలని లేదు. ఈ అరణ్యంలో ఏ ముఠావాళ్ళతోనూ నాకు విరోధం లేదు. కావాలని శ్వానకర్ణే నాతో విరోధం పెట్టుకున్నాడు. మా వాళ్ళు దొంగి లించారనే రాతి గద లాంటివి ఇరవై రాతి గదలు అతడి కివ్వగలను. సరా,'' అన్నాడు బిడాలి.

''నాక్కావలసింది, మా మూలపురుషుడి రాతి గద. దానిలో ఎంతో మహత్తు వున్నది. మీరు దొంగిలించుకుపోయిన దానికి బదు లుగా వెయ్యి గద లిస్తామన్నా, నేనొప్పను,'' అన్నాడు శ్వానకర్ణి రౌద్రంగా.

''ఆ మహత్తున్నమ్మే, మావాడు మడుగు పక్క గుహలోవున్న నిప్పులుకక్కే సింహాన్ని చంపేందుకు వెళ్ళి, హతమారిపోయాడు,'' అన్నాడు బిడాలి ఈసడింపుగా.

''అది సరే, గద ఎక్కడున్నది?'' అని ప్రశ్నించాడు జయమల్లు.

''గదా వాడూ కూడా అయిపూ అజా లేకుండా పోయారు. ఆ సింహం వున్న గుహ లోకి వాడు ప్రవేశించటం చూసిన వాళ్ళు న్నారు తప్ప, బయటికి రావటం చూసినవాళ్ళు లేరు. అది వాణ్ణి చంపి తినేసి వుంటుంది,'' అన్నాడు బిడాలి.



''మోసం! నేను నమ్మను!'' అంటూ శ్వానకర్ణి గెంతులేస్తూ గట్టిగా అరవటం ప్రారంభించాడు.

జయమల్లు బిడాలిని దూరంగా తీసుకు పోయి, నిజం చెప్పవలసిందిగా కోరాడు. బిడాలి ప్రమాణాలు చేసి జరిగినదంతా చెప్పి, ''ఆ భాగ్‌మారా నా ముఠావాడయినా, ఆ గద దొంగిలించటం సంగతి నా కేమీ తెలియదు. నా ముఠాలోని కుర్రకారు ప్రోద్బలంతో వాడా పని చేశాడు. తగిన శిక్ష అనుభవించాడు,'' అన్నాడు.

జయమల్లు, శ్వానకర్ణి దగ్గిరకు వచ్చి, ''శ్వానకర్ణీ, నువ్వు బిడాలి మాటలు నమ్మ వచ్చు. మీ మూలపురుషుడి గదలో అంత మహత్తు వున్నదనుకుంటే, దానిని మేము తెచ్చి పెట్టగలం. మీరూ మీరూ సఖ్యంగా వుండండి,'' అన్నాడు.



''బిడాలి మాటలు నమ్మటం అంటే, ఆ గద నిప్పులుకక్కే సింహం గుహలో వున్నదనుకోవాలి. సింహం మనిషిని తిన్నదేమోకాని, రాతి గదను కూడా తిన్నదనుకోవటం కుదరదు గదా? ఆ సింహం గుహలో ప్రవేశించి, ఆ గదను మీ రెలా తేగలరు?'' అన్నాడు శ్వానకర్ణి ఆశ్చర్యంగా.

''మా శక్తి ఇంకా మీకు తెలియలేదన్న మాట. పదండి, ఆ సింహంవుండే మడుగూ, గుహా చూపండి,'' అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు.

కేశవుడూ, కోయగోమాంగ్ అతడి వెనక బయలుదేరారు.

బిడాలి శ్వానకర్ణి తమ తమ అనుచరులతో అరణ్యంలో కొంత దూరం నడిచి ఒక పెద్ద నీటి మడుగు దగ్గరకు వచ్చారు. ఆ నీటి మడుగుకు అవతలి ఒడ్డున ఒక ఎత్తయిన కొండ వున్నది. అందులో అనేక గుహలు వున్నవి. మడుగునీరు, కొండఅంచువరకూ అనుకుని పొర్లిపొర్లి ప్రవహిస్తున్నది. ఒక పెద్ద నీటిపాయ ఏదో ఆ మడుగులోంచి, దూరంగా వున్న కొండల కేసి ప్రవహించటం జయమల్లు గమనించాడు.

''అదుగో, ఆ కనిపించే పెద్దగుహ సింహానికి నివాసస్థానం. అక్కడికి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వచ్చినవాడెవడూ లేడు,'' అన్నాడు బిడాలి. శ్వానకర్ణి అవునన్నట్టు పైకీ కిందికీ తలాడించాడు.

జయమల్లు, కేశవుణ్ణీ, కోయగోమాంగ్‌నూ కొంచెం దూరంగా తీసుకువెళ్ళి, సాహసించి సింహం వున్న గుహలోకి ప్రవేశించి, దానిని చంపటమా, మానటమా అన్న సమస్య గురించి చర్చించాడు. ఇంత దూరం వచ్చిం తరవాత, ఇప్పుడు వెనక్కు తిరగటం తెలివైన పని కాదని కేశవుడూ, గోమాంగ్ కూడా సలహా ఇచ్చారు. కాని, నిప్పులు కక్కే సింహం అంటున్నారే, దాన్ని తమ బాణం దెబ్బలతో చంపగలగటం సాధ్యమా అన్న అనుమానం వాళ్ళకు కలిగింది.

''ఎంత బలమైన మృగాన్నయినా సరే, ఒక్క అంబు దెబ్బతో కదలా మెదలక పడేలా చేయగలిగిన విషం నా దగ్గిర వున్నది. ఆ విషం పూసిన బాణం తగిలితే, ఆ సింహం చాప చుట్టలా కింద పడి వూరుకుంటుంది. కాని, బాణం గురి తప్పితే మాత్రం మనకు చావు తప్పదు,'' అన్నాడు గోమాంగ్.

''మూడు బాణాలు గురి తప్పటం సాధ్యమా?'' అన్నాడు కేశవుడు.

''కాని, అది హఠాత్తుగా మన మీద ఏ రాళ్ళచాటునుంచో దూకితే, ఏంగాను?'' అని ప్రశ్నించాడు గోమాంగ్.

''ఆ ప్రమాదం రాకుండా, మనం తగు జాగ్రత్తలో వుందాం. అసలు ఆ సింహం ఆ గుహలో వున్నదో, మరెటయినా పోయిందో ముందు తెలుసుకోగలిగితే బావుణ్ణు. అది నిశ్చయంగా గుహలో వున్నదని తెలిస్తే, అది మన మీద దొంగ చాటుదెబ్బ తీయకుండా జాగ్రత్తపడవచ్చు,'' అన్నాడు జయమల్లు.

''సింహం గుహలో వున్నదీ లేనిదీ తెలుసుకోవటం, ఏమంత కష్టం కాదు. కొన్ని జంతువులను-ఏ మేకల్నో, దున్నపోతుల్నో, ఆ గుహకేసి తోలితే, వాటినిచూసి సింహం గుహనుంచి బయటికి రావచ్చు. లేదా, జంతువులు అది వున్నట్టు వాసనపట్టి దూరంగా పారిపోవచ్చు,'' అన్నాడు కోయ గోమాంగ్.

ఈ ఉపాయం జయమల్లుకూ, కేశవుడికీ కూడా నచ్చింది. వాళ్ళు ఈ సంగతి చెప్పగానే, శ్వానకర్ణి తన ముఠావాళ్ళను పంపి, పది మేకలనూ, కొన్ని ఎనుబోతులనూ అక్కడికి తెప్పించాడు. తరవాత వాటి నన్నిటినీ ఒక దానికొకటి తాళ్ళతో కట్టి, మడుగు కవతల వున్న కొండ గుహకేసి తోలించాడు.

జంతువులు నీటిలో ఈదుతూ సింహం వుండే గుహకేసి మామూలుగానే వెళ్ళి, గుహ మరి కొంచెం దూరంలో వుందనగా, పెద్దగా బెదిరిపోయి, తాళ్ళు తెంచుకుని, అరుస్తూ చెల్లా చెదురుగా నీటివాలున పడి పారిపోసాగినై.

''సింహం గుహలోనే వున్నది, సందేహం లేదు. కాని, అది జంతువులను పట్టేందుకు గుహ నుంచి బయటికి ఎందుకు రాలేదో, తెలియకుండా వున్నది,'' అన్నాడు బిడాలి.



శ్వానకర్ణి వికటంగా నవ్వుతూ, ''నీ ముఠా వాళ్ళు దానికి మనిషి మాంసం రుచి ఎలా వుంటుందో చూపించారు. ఇక అది మను షుల్ని తప్ప తినదు. చాతనైతే మీ వాడి నొకణ్ణి పంపు, గుహలో నుంచి బయటికి దూకు తుంది,'' అన్నాడు.

శ్వానకర్ణి మాటలకు ఉగ్రుడైపోయి బిడాలి ఏదో అనబోయేంతలో, జయమల్లు అతణ్ణి సమాధానపరుస్తూ, ''ఇప్పుడు మళ్ళీ మీరు తగూలాడుకోకండి. సింహాన్ని చంపి, రాతిగద తెచ్చేపని మాది. మీరు చేయవలసిందల్లా, మాకు ఒక తెప్ప కట్టివ్వటం,'' అన్నాడు.

శ్వానకర్ణి ఆజ్ఞ ఇవ్వగానే అతడి అను చరులు కొన్ని ఎండు కర్రలు తెచ్చి, వాటిని చెట్ల ఊడలతో గుదికట్టి మడుగులోకి తోశారు. ఈ లోపల కోయ గోమాంగ్, తను దాచి వుంచు కున్న విషాన్ని అన్ని బాణాల మొనలకూ రాసి, వాటిని బాగా ఎండ పెట్టాడు. ముగ్గురూ తెప్ప ఎక్కి, దాన్ని తోసేందుకు అమర్చిన గడ కర్రలను చేతికి తీసుకున్నారు.

జయమల్లు, మడుగు ఒడ్డున నిలబడి వున్న బిడాలినీ, శ్వానకర్ణినీ ఉద్దేశించి, ''మీరు, ఇక్కడ వున్నా సరే, లేక శాంతంగా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయినా సరే, మాకు అభ్యం తరం లేదు. మేము ఒక గంటలో ఆ రాతి గద తీసుకుని వస్తాం,'' అన్నాడు.

బిడాలిగాని, శ్వానకర్ణిగాని మాట్లాడలేదు. వాళ్ళిద్దరికీ జయమల్లూ అతడి అనుచరులు ఇక తిరిగి రావటం అంటూ వుండదన్న భయం పట్టుకున్నది. అది గ్రహించిన జయ మల్లు, ''గంట ఎందుకు, పావుగంటలోనే తిరిగి వస్తాం. రాతి గదను శ్వానకర్ణికీ, నిప్పులు కక్కే సింహం చర్మాన్ని బిడాలికీ బహూక రిస్తాం,'' అన్నాడు పెద్దగా.

తెప్ప క్రమంగా మడుగు దాటి సింహం వుండే గుహను సమీపించింది. ''గుహలో ఏదో అలికిడైనట్టు నాకు అనుమానంగా వున్నది,'' అన్నాడు కోయ గోమాంగ్.

''అనుమానాలతో ఏం పని, మనం గుహ లోకి వెళ్ళబోతున్నాం గదా,'' అంటూ కేశ వుడు, తెప్ప ఒడ్డు తాకగానే ఎగిరి గంతేసి కిందికి దూకాడు. ముగ్గురూ నిశ్శబ్దంగా నడుస్తూ గుహను సమీపించి, లోపలికి తొంగి చూశారు. -(ఇంకావుంది)






# సహనశీలం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అకుంఠిత దీక్షతో శ్రమ పడుతూన్న నీ పట్టుదల మెచ్చతగినదే. కాని, తీరా ఫలితం అందుకునే సమయంలో చంచల చిత్తుడివై ఎలా ప్రవర్తిస్తావో ఏమోనన్న అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే కొందరు ఎప్పుడు ఎలాంటి నిర్ణయాలు తీసుకుంటారో తెలియదు. నీకు తగుహెచ్చరికగా ఉండగలందులకు చపల చిత్తులైన కోయ యువతీయువకుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దండకారణ్యం తూర్పుదిశలో మార్తాండమనే కోయగూడెం

బేతాళ కథలు



ఉండేది. సాహస ప్రియులైన ఆ కోయగూడెం యువతీ యువకులు ఒకనాటి సాయంకాలం ఆట పాటలలో తేలియాడి, ఒక తటాకం ఒడ్డున కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. అందమైన ఆ తటాకంలోని చేపలు ఎగిరెగిరి పడుతూండడం చూడడానికి ఆహ్లాదకరంగా ఉన్నది.

''గాలిలోకి ఎగిరి పడుతూన్న చేపపిల్లను గురిచూసి బాణంతో ఎవరైనా కొట్టగలరా?'' అంటూ సవాలు విసిరాడు ఆ బృందంలోని ఒక యువకుడు.

''నీటి నుంచి ఎగిరే చేపపిల్ల గాలిలో ఉండేది లిప్తకాలమే. గురి చూడ్డానికి కూడా ఆ సమయం చాలదు. దానిపై బాణ ప్రయోగం అసాధ్యం!'' అన్నాడు ఇంకొక యువకుడు తల అడ్డంగా ఊపుతూ.

''అవును, నిజం. అది సాధ్యం కానిపని,'' అన్నాడు మరొక యువకుడు.

''పట్టుదలతో ప్రయత్నిస్తే, అసాధ్యమే సుసాధ్యమవుతుంది,'' అన్నాడు మొదటి యువకుడు.

ఆ మాట విన్న తరవాత ఊరుకోలేక ముగ్గురు యువకులు ప్రయత్నించారు కాని, కొట్టడం వారికి సాధ్యంకాలేదు.

ఆ బృందంలో నెలవంక అనే అందాల యువతి ఉన్నది. ఆమె అందచందాలకు ముగ్ధులుకాని యువకులు ఆ గూడెంలో లేరు. ఆమెకు ప్రతాపుడంటే చాలా ఇష్టం. ప్రతాపుడు చక్కని దేహదారుఢ్యంతో చిరుత పులిలా చురుకైన వాడు. నెలవంక అతడి విలువిద్యాపాటవాన్ని పరీక్షించాలనుకుని, ''ఎగిరి పడే చేపపిల్లను కొడితే, నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను,'' అన్నది చిన్నగా నవ్వుతూ.

ప్రతాపుడు ఉప్పొంగిన హృదయంతో లేచి చాలా ఏకాగ్రతతో గురిచూసి బాణం వదిలాడు. ఎక్కడో చిన్న తప్పిదం జరగడంతో చేపపిల్లకు వెంట్రుకవాసిలో బాణం దూసుకుపోయింది. ప్రతాపుడు ఆశాభంగానికి లోనయ్యాడు.

దానిని చూడగానే అతనికి కొద్ది దూరంలో మిత్రుడితో కలిసి కూర్చున్న వీరమల్లు అనే యువకుడిలో ఉత్సాహం పెల్లుబికింది. వాడికి నెలవంక అంటే మహా ఇష్టం. ఆమెను పెళ్ళాడడానికి ఇదొక గొప్ప అవకాశంగా భావించాడు. పట్టుదలతో బాణం ఎక్కుపెట్టి, శక్తినంతా

బాణంపై కేంద్రీకరించి, చేపపిల్ల వాలే దిశగా వదిలాడు. అంతే, బాణం మెరుపు వేగంతో వెళ్ళి చేపపిల్లను తాకింది! అక్కడ ఉన్న వారందరూ చప్పట్లు కొట్టి అతణ్ణి మెచ్చుకున్నారు. వీరమల్లు గర్వంతో పొంగిపోతూ, ''అందాలరాణీ, నువ్వు విసిరిన సవాలులో గెలుపొందాను కదా? నీ మాట ప్రకారం మనం పెళ్ళి ఎప్పుడు చేసుకుందాం?'' అని అడిగాడు నెలవంకను చూస్తూ.

ఆ మాటకు ఉలిక్కిపడిన నెలవంక కోపావేశంతో, ''నేను నిన్ను వివాహం చేసుకోవడమా? కలలో కూడా అది జరగదు. సవాలులో గెలుపొందితే, ప్రతాపుణ్ణి పెళ్ళాడుతానని చెప్పానే తప్ప, సవాలులో ఎవడు గెలిస్తే వాణ్ణి పెళ్ళాడతాననలేదు,'' అన్నది.

''ఏమిటీ ప్రతాపుణ్ణి మాత్రమే పెళ్ళాడతానన్నావా? మరి వాడి పేరు చెప్పలేదే. గెలిస్తే నిన్ను పెళ్ళాడతానన్నావు. ఇప్పుడు నేను గెలిచాను. నన్ను పెళ్ళాడడానికి అభ్యంతరం దేనికి? గూడెంలో ప్రతాపుడికి ఒక న్యాయం, నాకొక న్యాయమా?'' అంటూ అడ్డదిడ్డంగా వితండవాదానికి దిగాడు వీరమల్లు.

''అవును. గూడెంలో అందరికీ ఒకే న్యాయం ఉండాలి. నెలవంక వీరమల్లును మనువాడవలసిందే,'' అంటూ జంబీరుడనే యువకుడు వీరమల్లుకు మద్దతుగా నిలిచాడు.

''వివాహ విషయంలో అందరికీ ఒకే న్యాయం వర్తించదు. నచ్చిన వాణ్ణి కోరుకోమంటే తెలివిగలపిల్ల దుర్మార్గుణ్ణి కోరుకుంటుందా? ఇది నా పెళ్ళి; నా ఇష్ట ప్రకారమే



జరుగుతుంది. అడగడానికి నువ్వెవడివి?'' అన్నది నెలవంక ఆవేశంతో.

''అదంతా నాకు తెలియదు. నువ్వు పెళ్ళి చేసుకోగలవన్న ఆశతోనే నేను నీ సవాలును స్వీకరించాను. ఇప్పుడు కాకపోతే, మరెప్పుడైనా ఎలాగైనా నిన్నే నేను పెళ్ళాడి తీరుతాను,'' అని ప్రతిజ్ఞ చేశాడు వీరమల్లు.

ఇలాంటి తగాదాలు అరుదుగా తలెత్తినప్పటికీ, మార్తాండ జాతిలో ఐకమత్యం ఎక్కువ. మంచివాడు–చెడ్డవాడు, బలవంతుడు–బలహీనుడు అన్న భేదాలు పాటించకుండా ఎవరైనా ప్రాణాపాయంలో వుంటే చూసిన వాడు తన ప్రాణాలనైనా పణంగాపెట్టి కాపాడడం వాళ్ళ సంప్రదాయం. ఒకనాడు వీరమల్లు తేనెను సేకరిస్తూ నిటారు బండల మధ్య చిక్కుకు పోయాడు. వాడు కింద



పడిపోయే ప్రమాదాన్ని, ఆ దారిగుండా వచ్చిన ప్రతాపుడు చూసి, వాణ్ణి కాపాడాడు. ప్రతాపుడు ఆ సంఘటనను గుర్తు చేసుకుంటూ వీరమల్లుతో, 'నెలవంక నిన్ను వివాహమాడడంలో నాకెలాంటి అభ్యంతరమూ లేదు. అయితే, మంచితనంతో ఆమె మనసును దోచుకోవడానికి ప్రయత్నించు,'' అన్నాడు.

''అవన్నీ నాకు తెలుసు. నువ్వేం చెప్పనవసరం లేదు,'' అంటూ వీరమల్లు అక్కణ్ణించి విసురుగా వెళ్ళిపోయాడు.

కొన్ని రోజులు గడిచాయి. ఒకనాడు వేట ముగించి, భోజనం చేసి తీరిగ్గా కూర్చుని ఏవో మాట్లాడుకుంటూన్న యువతీయువకుల మీదికి హఠాత్తుగా నాలుగు పులులు వచ్చి పడ్డాయి. ఊహించని ఈ పరిణామంతో యువతీయువకులు చెల్లాచెదరయ్యారు. పరిగెత్తుతూ, నెలవంకను పులి పంజాదెబ్బ నుంచి వీరమల్లు ఒడుపుగా కాపాడాడు. యాదృచ్ఛికంగా ఇద్దరూ ఇరుకైన లోయలోకి జారిపోయారు. నెలవంకకు మోచేయి గీసుకుపోయి నెత్తురు కారసాగింది. ఎత్తు నుంచి కిందికి పడడంతో ఆమెస్పృహకోల్పోయింది. ఆమె ముఖం మీద నీళ్ళు చల్లి స్పృహ తెప్పించడానికి వీరమల్లు దాపులనున్న కొలను కేసి పరిగెత్తాడు.

పైనుంచి ఆ దృశ్యాన్ని చూసిన అతడి మిత్రుడు జంబీరుడు, ''మిత్రమా, అదృష్టం అంటే నీదే. వెంటనే నీకుడి చేతికి గాయం చేసుకుని, నీ రక్తాన్ని నెలవంక మోచేతి నుంచి కారే రక్తంతో కలిపెయ్. ఆ తంతుతో మీ ఇద్దరికీ పెళ్ళయినట్టే లెక్క. త్వరగా కానియ్. నేను వెళ్ళి మీకు పెళ్ళయిపోయిందని మన గూడెంలో అందరికీ చెబుతాను,'' అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

జంబీరుడి ప్రచారం విని ప్రతాపుడూ, అతడి మిత్రులూ ఆశ్చర్యపోయారు. వీరమల్లు నెలవంకను బలవంతంగా పెళ్ళాడివుంటాడని కులపెద్దకు ఫిర్యాదు చేశారు. చండశాసనుడైన కులపెద్ద రచ్చబండవద్దసమావేశం ఏర్పాటు చేసి, ''బిడ్డా, నెలవంకా! మనసంప్రదాయం ప్రకారం వధువు మొదట వరుడి కుడిచేతిని చురకత్తితో గాయపరచి నెత్తురు చిందిస్తే, వరుడు ఆమె ఎడమ చేతిపైనెత్తురు గాయంచేసి, ఇరువురి నెత్తురూ కలిసే విధంగా చేతులు పెనవేసుకోవాలి. మీ చేతులకు గాయాలయితే కనిపిస్తున్నాయి. పెళ్ళి

నీ సమ్మతంతో జరిగిందా? వీరమల్లు నిన్ను బలవంతంగా పెళ్ళాడివుంటే చెప్పు. వాడి కనుగుడ్లు పెకలించి గద్దలకు ఆహారంగా వేస్తాను. శుద్ధి కార్యక్రమం జరిపించి నీకు ఇష్ట మైన వాడితో వివాహం జరిపిస్తాను'' అన్నాడు.

నెలవంక నిదానంగా ఆలోచించి, ''వీర మల్లుతో నాకు జరిగిన వివాహాన్ని నేను మన స్ఫూర్తిగానే అంగీకరిస్తున్నాను. నా వివాహం కారణంగా, గూడెంలో ఐకమత్యం చెక్కు చెదరకూడదు,'' అన్నది.

వీరమల్లు ఆ మాట విని ఒక అడుగు ముందుకువేసి, ''లేదు దొరా, లేదు. అసలు మా వివాహమే జరగలేదు. నా మిత్రుడి మాటవిని అవకాశం దొరికింది కదా అని నా చేతిని గాయపరుచుకుని పెళ్ళితంతు జరిపిం చేయాలని ఉబలాటపడ్డ మాట వాస్తవం. అయితే, స్పృహతప్పి పడివున్న నెలవంకను సమీపించి, నిర్మలమైన నిండు చందమామ లాంటి ఆమె ముఖం చూసి ఆ పని చేయ లేకపోయాను. నేను ఇప్పుడే గూడెంవదిలి నా మిత్రుడితో సహా వెళ్ళిపోతున్నాను,'' అంటూ అక్కడినుంచి బయలుదేరాడు.

గూడెంపెద్ద ఇరువురినీ మెచ్చుకోలుగా చూశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అటు నెలవంకా, ఇటు వీరమల్లూ అంత అసం బద్ధంగా ఎందుకు ప్రవర్తించారు? చండ శాసనుడైన కులపెద్ద సమక్షంలో తనకు ఇష్టం లేని పెళ్ళి జరిగిపోయిందని ఒక్క మాట చెప్పివుంటే నెలవంకకు కోరిన యువకుడు భర్త అయ్యేవాడు కదా? ఆ అవకాశాన్ని జార విడిచి, తొలినుంచీ నిరసిస్తూ, అసహ్యించు



కుంటూన్న వీరమల్లును మనస్ఫూర్తిగా పెళ్ళాడానని ఎందుకు అబద్ధం చెప్పింది? మొదట నెలవంకను ఎలాగైనా పెళ్ళాడి తీరుతానని ప్రతిజ్ఞ చేసిన వీరమల్లు, ఆఖరికి ఆమె తాను స్వయంగా అంగీకరించినప్పటికీ, అసలు పెళ్ళేకాలేదని చెప్పి గూడెం వదిలి ఎందుకు వెళ్ళిపోయాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తమకు పెళ్ళి జరిగిపోయిందని అందరూ అనుకుంటున్నారే తప్ప, తను స్పృహకోల్పోయిన స్థితిలో ఉన్నప్పుడు జరిగిన దేమిటో నెలవంకకు తెలియదు. ఆమె వీరమల్లును మనస్ఫూర్తిగా వివాహమాడానని చెప్పడానికి కారణం–తోటి వారికి ప్రాణాపాయం అంటే తమ ప్రాణం అడ్డు వేసి కాపాడాలనే వారి జాతి దొడ్డగుణం, సంప్రదాయం ఆమె రక్తంలో జీర్ణించుకు పోవడం. తనకు ఇష్టం లేని పెళ్ళి జరిగిందన్నా, అసలు జరిగిందేమిటో తనకు తెలియదని చెప్పినా వీరమల్లుకు కఠిన శిక్ష తప్పదు. పులిబారి నుంచి తనను కాపాడిన వీరమల్లు శిక్షకు గురికావడం ఆమెకు ఇష్టంలేదు. అందువల్లే, తాను ఇష్టపడి పెళ్ళిచేసుకున్నానని అబద్ధం చెప్పింది. ఇక వీరమల్లు జరిగిన నిజాన్ని మాత్రమే చెప్పాడు. అతడికి నెలవంక మీద అమిత అభిమానం ఉన్న మాట నిజమే. కాని జాతి సంప్రదాయానికి విరుద్ధంగా, బలవంతగా ఆమెను పెళ్ళాడడం అతడి అభిమతం కాదు. ఇంత జరిగిన తరవాత తాను అక్కడే ఉంటే తన ప్రమేయం లేకున్నా, తన అనుచరుల కారణంగా గూడెం ప్రజల ఐకమత్యానికి భంగం వాటిల్లగలదన్న అనుమానంతోనే అతడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఇద్దరూ కూడా సహనశీలంతో గూడెం ప్రజల ఐకమత్యాన్ని ప్రాణప్రదంగా భావించి అలా ప్రవర్తించారే తప్ప, అందులో ఎలాంటి అసంబద్ధతా లేదు. దానిని గ్రహించడం వల్లే గూడెంపెద్ద కూడా వాళ్ళను మెచ్చుకోలుగా చూశాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]





# మన మొట్టమొదటి మహిళా రాష్ట్రపతి

**2007** జూలై 25వ తేదీ శ్రీమతి ప్రతిభా పాటిల్ భారత దేశ 13వ రాష్ట్రపతిగా పదవీ ప్రమాణస్వీకారం చేశారు. మనదేశ చరిత్రలో ప్రాముఖ్యతను సంతరించుకున్న రోజు అది. మనదేశం ఒక మహిళను అత్యున్నతమైన దేశాధ్యక్ష పదవికి ఎన్నుకోవడం అదే ప్రథమం!

మహారాష్ట్ర జల్గాంవ్‌లో నారాయణరావు పాటిల్, గంగా బాయి దంపతులకు 1934 డిసెంబర్ 19వ తేదీ ప్రతిభ జన్మించారు. ఆమెకు ఆరుగురు అన్నదమ్ములు. మెట్రిక్యులేషన్ చదువుతూన్న సమయంలో ఆమె తల్లి మరణించారు. తండ్రినీ, అన్నదమ్ములనూ చూసుకోవడానికి చదువు మానేస్తుందేమోనని అందరూ అనుమానించారు.

అయితే, అప్పటికే కళాశాలలో చదువుకుంటూన్న అన్నయ్య ప్రోత్సాహంతో కళాశాలలో చేరారు. రాజకీయ-అర్థికశాస్త్రాలలో ఎం.ఎ. పట్టాపుచ్చుకుని, తండ్రి వృత్తిపట్ల ఆకర్షించబడి బొంబాయి లాకాలేజీలో చేరి, పట్టభద్రురాలై న్యాయవాద వృత్తిని చేపట్టారు.

కళాశాలలో చదివే రోజుల్లో ఆమె టేబుల్ టెన్నిస్‌లో కాలేజ్ ఛాంపియన్‌గా ఉండేవారు. అంతర్ కళాశాల పోటీల్లో పాల్గొని పలు కప్పులూ, షీల్డులూ సాధించారు.

1962 ఎన్నికల్లో పోటీ చేసి మహారాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. ఐదు సార్లు మంత్రిగా విభిన్న శాఖలను సమర్థవంతంగా నిర్వహించారు. 1985లో రాజ్యసభకు ఎన్నుకోబడి 1986-88 మధ్య కాలంలో రాజ్యసభ డిప్యూటీ చైర్‌పర్సన్ పదవీ బాధ్యతలు నిర్వహించారు. 1991లో లోక్‌సభకు ఎన్నుకోబడ్డారు.

2004లో శ్రీమతి ప్రతిభా పాటిల్ రాజస్థాన్ గవర్నర్‌గా నియమించబడ్డారు. గత జూలైలో జరిగిన రాష్ట్రపతి ఎన్నికలలో ఐక్య ప్రగతిశీల కూటమి (యుపిఎ) తరఫున పోటీ చేసి ఘనవిజయం సాధించారు.

సమాజసేవ పట్ల ప్రతిభా పాటిల్‌కు ఆసక్తి మెండు. కంటిచూపు కొరవడిన వారికోసం ఆమె ఒక పారిశ్రామిక శిక్షణా పాఠశాలను నెలకొల్పారు. ముంబైలోనూ, ఢిల్లీలోనూ వర్కింగ్ వుమన్స్ హాస్టల్స్, జల్గాంవ్‌లో ఒక ఇంజినీరింగ్ కళాశాలనూ స్థాపించారు.

లక్షలాది మంది చందమామ పాఠకుల తరఫున భారత తొలి మహిళా రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభా పాటిల్‌గారికి శుభాకాంక్షలు తెలియజేస్తూ, దేశ ప్రథమ పౌరులుగా ఆమె మరిన్ని విజయాలను సాధించాలని ఆకాంక్షిస్తున్నాం.

చతురోక్తులు, హాస్యం, సమయస్ఫూర్తి అనగానే మనకు అక్బర్ ఆస్థానంలోని బీర్బల్ గుర్తుకు వస్తాడు. ఎదురైన ప్రతి సమస్యకూ సమయస్ఫూర్తితో పరిష్కారం సూచించే హాస్యరసప్రధానమైన బీర్బల్ కథలను ఈ సంచిక నుంచి ఒక్కొక్కటిగా చదువుదాం:

# కానుకలో వాటా

అక్బర్ చక్రవర్తి సభలో కొలువుదీరి వున్నప్పుడు ఒక యువకుడు మెల్లగా లోపలికి ప్రవేశించాడు. అక్బర్ చూపులు తనమీద పడగానే అతడు వంగి సలాం చేశాడు.

''ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావు?'' అని అడిగాడు అక్బర్ చక్రవర్తి.



''ప్రభూ! నా పేరు మహేశ్‌దాస్. ఆగ్రాకు నాలుగామడల దూరంలో వున్న కుగ్రామం మాది. ఉద్యోగం వెతుక్కుంటూ వచ్చాను,'' అన్నాడు యువకుడు.

''నీకు ఇక్కడ ఉద్యోగం దొరుకుతుందని ఎవరు చెప్పారు?'' అని అడిగాడు అక్బర్.

''నా తెలివితేటల్ని చూసి, 'నువ్వు చక్రవర్తి దగ్గరికి వెళ్ళు, నీకు తప్పక ఉద్యోగం దొరుకుతుంది,' అని మా పంతులే చెప్పారు. ఆయన మాటవిని అంతదూరం కాలినడకనే వచ్చి, అతి ప్రయత్నం మీద తమ దర్శనం చేసుకోగలిగాను ప్రభూ,'' అన్నాడు మహేశ్.

''ప్రతి ఉపాధ్యాయుడూ, తన విద్యార్థుల గురించి అలాగే గొప్పగా అంచనా వేస్తాడు. ఉత్తమ అర్హతలు గలవారికి మాత్రమే మేము ఇక్కడ ఉద్యోగలిస్తాం,'' అన్నాడు అక్బర్.

''నేను ఉత్తముల్లోకెల్లా ఉత్తముడినని రుజువు చేయగలను ప్రభూ,'' అన్నాడు మహేశ్ ఎంతో ఆత్మవిశ్వాసంతో.

''చేసి చూపు మరి. ఆలస్యం దేనికి?'' అన్నాడు అక్బర్.

''అందుకు ప్రభువులు ఒక చిన్న కాను కను దయచేయాలి,'' అన్నాడు మహేశ్.

''మొదట ప్రతిభను నిరూపించుకుంటే తప్ప కానుకలు ఇవ్వరు,'' అన్నాడు అక్బర్.

''నేను అడిగే కానుకకు దమ్మిడీ ఖర్చు కాదు ప్రభూ!'' అన్నాడు మహేశ్.

''అలాగా? ఏమిటది?'' అని అడిగాడు అక్బర్.

''ముప్ఫై కొరడా దెబ్బలు, ప్రభూ!'' అన్నాడు మహేశ్.

అతడి కోరిక విని చక్రవర్తితో పాటు అందరూ ఆశ్చర్యపోయారు.

''నీకేమైనా పిచ్చి పట్టిందా?'' అన్నాడు అక్బర్ అసహనంగా.

''ఆ సంగతి తరవాత తెలుస్తుంది. మొదట నేను అడిగింది దయచేసి ఇప్పించండి ప్రభూ,'' అన్నాడు మహేశ్ వినయంగా.

అక్బర్ వెంటనే కొరడా తెప్పించి, దాన్ని తెచ్చిన వాణ్ణి దగ్గరికి పిలిచి, ''కొరడాతో వాణ్ణి నిజంగానే కొట్టొద్దు. కొడుతున్నట్టు అభిన యిస్తూ, మెల్లగా తాకించు,'' అని చెవిలో చెప్పాడు.

భటుడు వెళ్ళి అలా ఝుళిపిస్తూంటే, ముందుకు వంగిన మహేశ్, ఒకటి, రెండూ... అంటూ లెక్కించి, పది రాగానే, ''ఆగు!'' అని అరిచి తలెత్తి అక్బర్ చక్రవర్తిని చూస్తూ, ''ప్రభూ, కానుకలో నా వాటా నేను పుచ్చు కున్నాను. ఇక మిగిలిన దాన్ని తమ ఉద్యో గుల్లో ఇద్దరు సమంగా పంచుకుంటారు,'' అన్నాడు.



''ఏమిటి నువ్వంటున్నది?'' అని అడి గాడు అక్బర్ అతడు చెబుతున్నది అంతు బట్టక.

''అవును ప్రభూ! భవన ద్వారం వద్ద నిల బడ్డ ఇద్దరు కాపలా భటులు ఏదైనా ఇస్తే తప్ప నన్ను లోపలికి వదలనన్నారు. 'నా దగ్గర డబ్బులు లేవు. ప్రభువిచ్చే కానుకను మీతో సమానంగా పంచుకుంటాను,' అని మాట ఇచ్చి లోపలికి వచ్చాను ప్రభూ,'' అన్నాడు మహేశ్.

''అలాగా!'' అన్నాడు అక్బర్ కోపంతో.

''వాళ్ళను పిలిపిస్తే అంతా తమకు తెలు స్తుంది,'' అన్నాడు మహేశ్.

అక్బర్ తల పంకించాడు.

కొంతసేపటికి ఆ ఇద్దరు భటులూ అక్క డికి రాగానే, ''మిత్రులారా, మీరు నాకెంతో

సాయపడ్డారని ప్రభువులకు విన్నవించాను. మీ దయ లేకుంటే నాకు ప్రభువుల దర్శన భాగ్యం లభించేదికాదని చెప్పాను. ఆయన దయచేసిన కానుకలో మీకు తలా ఒక వాటా ఇవ్వాలి కదా. ప్రభువులు ఇప్పిస్తారు. పుచ్చుకోండి,'' అన్నాడు మహేశ్.

ఇద్దరు భటులూ, సంతోషంగా తలలూపారు.

ఒక భటుణ్ణి ముందుకు రమ్మని, కొరడా పట్టుకున్న వ్యక్తి పది దెబ్బలు కొట్టాడు. ఆ తరవాత రెండవ కాపలాభటుడు కుయ్యో మొర్రో అంటూ మిగిలినపది కొరడాదెబ్బలూ తిన్నాడు.



''ఈ క్షణమే, లంచగొండులైన మిమ్మల్ని, ఉద్యోగాల నుంచి తొలగిస్తున్నాను,'' అన్న అక్బర్ చక్రవర్తి, మహేశ్‌కేసి తిరిగి, ''నువ్వు చాలా తెలివైనవాడివి. మీ బడిపంతులు చెప్పింది నిజం. నీ సమర్థత నిరూపించుకున్నావు. ఇప్పుడే నిన్ను బీర్బల్ పేరుతో నా ఆస్థానంలో ఉన్నత పదవిలో నియమిస్తున్నాను,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

## విజ్ఞప్తి

ఎనిమిది పేజీలు ఎక్కువగా 15 రూ.ల ధరతో వెలువడిన జూలై జన్మదిన సంచికను పాఠకులు అత్యంత అభిమానంతో ఆదరించడం మాకెంతో సంతోషం కలిగించింది. ఆ సంచికను చూసిన పలువురు పాఠకులు అదే విధంగా ఎక్కువ పేజీలతో మరిన్ని కథలతో వస్తే బావుంటుందనీ, ధరపెంచినా ఫరవాలేదనీ సూచించారు. పాఠకుల కోరిక ప్రకారం అక్టోబర్ 2007 సంచిక నుంచి ఎమిమిది పేజీలు ఎక్కువగా రూ. 15ల ధరతో తీసుకురావడానికి నిర్ణయించాం. ప్రస్తుతం సెప్టెంబర్ తరవాత అయిపోయే చందాలలో ఎలాంటి మార్పూ ఉండదు. రెన్యువల్ చేసేవారికీ, నూతన చందాలకూ, సంవత్సర చందా రూ. 180లు. భారతీయ ద్రవ్యమానంలో (రూ. 900/-) చెల్లించే విదేశీ చందాలలోనూ ఎలాంటి మార్పూ లేదు.

– సంపాదకుడు / ప్రచురణకర్త

# చందమామ కబుర్లు

## పదిహేడవసారి పర్వతారోహణ!




సూపర్ షెర్పా ఎక్స్‌పిడిషన్‌కు చెందిన ఆపా షెర్పా మరి ఐదుగురు షెర్పా గైడ్లు మే 16వ తేదీ ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించారు. ప్రపంచంలోనే అత్యంత ఎత్తయిన (8,850మీ.) ఈ పర్వత శిఖరాన్ని ఆపా షెర్పా 17వ సారి అధిరోహించాడు. ఇది ఇప్పటికి ప్రపంచ రికార్డు. చివాంగ్ నీమా అనే షెర్పా గైడ్ 2006లో 14వ సారి అధిరోహించాడు. ఆపాతో కలిసి ఈ సంవత్సరం వెళ్ళిన ఘెలూ షెర్పా 13వసారి అధిరోహించాడు. ఈ పర్వతారోహకులు శిఖరం మీదపదిహేను నిమిషాలు గడిపి, కిందికి దిగడం ప్రారంభించారు. 17 సార్లు ఎవరెస్టును అధిరోహించిన 46 ఏళ్ళ ఆపా షెర్పా ఆరోగ్యంగానే ఉన్నప్పటికీ, ఎవరెస్టు మీదికి వెళ్ళడం ''ఇదే ఆఖరుసారి. ఎవరెస్టుకు ఇక ఎవర్ రెస్ట్,'' అన్నాడు పత్రికలవాళ్ళతో నవ్వుతూ.

## డా. అబ్దుల్ కలామ్‌కు అవార్డు

రాయల్ సొసైటీ ఆఫ్ లండన్ ఏర్పాటు చేసిన రెండవ కింగ్ చార్లెస్ అవార్డును డా. ఎ.పి.జె. అబ్దుల్ కలామ్ అందుకున్నారు. తమ దేశంలో విజ్ఞాన పరిశోధనల పురోగతికి పాటుపడ్డ దేశాధి నేతలకే ఈ అవార్డును ప్రదానం చేస్తారు. అటువంటి అరుదైన గౌరవ పురస్కారాన్ని 1998వ సం.లో జపాన్ చక్రవర్తి అకిహితోకు అందజేశారు. ఇప్పుడు రెండవ వారుగా మన అబ్దుల్ కలామ్ అందుకున్నారు. ''ప్రపంచం మొత్తం మీద కొందరు రాజ్యాధినేతలు మాత్రమే జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ విజ్ఞాన శాస్త్రాన్ని అభివృద్ధి చేయడానికి పాటుపడుతున్నారు. భారత రాష్ట్రపతిగా మీ అధ్యక్షతలో భారతదేశం శాస్త్ర, సాంకేతిక రంగాలలో విస్తృత పెట్టుబడులతో ముందుకు సాగుతూ, విజ్ఞాన శాస్త్ర ప్రాచుర్య కార్యకలాపాలు విరివిగా జరుగుతున్నాయి. ఇండియాస్ టెక్నాలజీ విజన్ 2020 రూపొందించడం ద్వారా భారతదేశం వర్ధమానదేశం స్థాయి నుంచి అభివృద్ధి చెందిన దేశంగా రూపాంతరం చెందడానికి చక్కని దిశానిర్దేశం చేశారు,'' అంటూ సొసైటీ అబ్దుల్ కలాంను ప్రశంసించింది. సిల్వర్-గిల్ట్ పతకంతో ప్రశంసాపత్రాన్ని అందించారు.





# నమ్మించలేని నిజం!

బాలానంద గురుకులంలో చదివే మణి రత్నం ఏం చెప్పినా సహవిద్యార్థులు నమ్మే వారు కారు. ఎందుకంటే చిన్న చిన్న అబద్ధాలు చెప్పడం అంటే వాడికి మహాసరదా. ఒకనాటి సాయంకాలం వాడు ఏదో చెప్పడానికివస్తే, ''వద్దు, నాయనా, మేము మీ మాట నమ్మం,'' అన్నారు విద్యార్థులు. 'నేను ఇప్పుడు అబద్ధం చెప్పడం లేదు. నిజం, నా మాట నమ్మండి,'' అంటూ మణిరత్నం ప్రాథేయపడుతున్నప్పటికీ ''వద్దు, నిన్ను నమ్మం,'' అంటున్నారు పిల్లలు.

ఆ సమయంలో అటుగా వచ్చిన గురువు బాలానందుడు, విషయం గ్రహించి మణి రత్నంతో, ''చీటికి మాటికి అబద్ధాలు చెప్పే వాడి గతి ఇంతే,'' అని చెప్పి పిల్లల కేసి తిరిగి, ''అయినా, ఎవరు ఏం చెప్పినా అందు లోని నిజానిజాలు గ్రహించాలి. అంతేగాని, అల్ప విషయాలకు కూడా అబద్ధాలు చెప్పే వాడు కదా అని అతడు ఏం చెప్పినా వినం అనడం భావ్యం కాదు. వెనకటికి ఒక దొంగ జరిగింది ఇదీ అని ఎంతమొత్తుకున్నా ఎవరూ దాన్ని నిజమని ఒప్పుకోలేదు. ఒక్కొక్కసారి నమ్మించలేని సంఘటనలు కూడా జరు గుతూ ఉంటాయి. మీకు ఆ కథ చెబుతాను, వినండి,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పెనుగొల్లుకు చెందిన రంగనాథం, రామ నాథం బండి మీద పట్నం సంతకు వెళ్ళి, అక్కడ తాము తెచ్చిన ధాన్యం అమ్మి, తమకు కావలసిన సరుకులు కొనుక్కుని, మిగిలిన డబ్బులను దుస్తుల్లో దాచుకుని, వచ్చిన బండిలోనే తిరుగు ప్రయాణమయ్యారు.

సగం దూరం వచ్చేసరికి వేసవి ఎండ తీవ్రం కాసాగింది. బండిని లాగుతూన్న ఎడ్లు కూడా నురగలు కక్కుతూ ఆయాస పడ సాగాయి. రహదారికి పక్కన కొద్ది దూరంలో

ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

ఒకపాడు పడిన గుడి కనిపించడంతో, బండిని అటు వైపు తిప్పి ఆపమన్నారు.

బండివాడు గుడి దాపులనున్న చెట్టు కింద బండిని ఆపాడు. కొంత గడ్డి తీసుకువెళ్ళి, గుడి ముందు అరుగు మీద పరిచాడు. ఆ ఎండు గడ్డి మీద రంగనాధం, రామనాధం కూర్చున్నారు. బండివాడు ఎడ్ల ముందు గడ్డి వేసి, బండి పక్కనే కూర్చున్నాడు.

ఆ సమయంలో అక్కడికి పెద్ద తలపాగా చుట్టుకుని బుర్ర మీసాలతో, చేతిలో అద్దాల పెట్టెతో ఒక మనిషి వచ్చాడు. తానొక మిఠాయి వ్యాపారిననీ, సింహాచలం తన పేరనీ పరిచయం చేసుకుని వాళ్ళ పక్కనే కూర్చున్నాడు.

రంగనాధం, రామనాధం పెరుగన్నం మూట విప్పి, బండివాడికీ, మిఠాయి వ్యాపారికీ కొంచెం పెట్టి, తామూ తిని నీళ్ళు తాగారు. ఎండ చల్లబడింది ఇక బయలుదేరుదామనుకుంటూన్నప్పుడు వ్యాపారి, ''నా మిఠాయిలు తిని చూడండి. చాలా రుచిగా ఉంటాయి,'' అంటూ ముగ్గురికీ మూడు మిఠాయి ఉండలు ఇచ్చి, తనూ ఒకటి తిన్నాడు. ''చాలా రుచిగా ఉన్నాయి,'' అంటూ తిన్న ఆ ముగ్గురూ నిమిషాల్లో స్పృహ తప్పి పడిపోయారు. మిఠాయిలు ఇచ్చిన వాడు నిజానికి మిఠాయి వ్యాపారి కాదు. ఆ వేషంలో వచ్చిన దొంగ. తను మంచి మిఠాయి తిని, వాళ్ళ ముగ్గురికీ మత్తు మందు కలిపిన మిఠాయిలు ఇచ్చాడు.

వాళ్ళ దగ్గరున్న సొమ్మును కాజేద్దామని వాడు అడుగు ముందుకు వేయబోతూండగా, దభీమని తల వెనక భాగంలో బలంగా దెబ్బ పడింది. గిర్రున కళ్ళు తిరిగి కింద పడ్డ దొంగకు ఎదుట పెద్ద కత్తితో దృఢకాయుడైన యువకుడొకడు కనిపించాడు. వాడూ దొంగ తనానికి వచ్చిన దొంగే!



నలుగురూ సొమ్మసిల్లి పడి వుండడం చూసి, తన పని సులభం అయిపోయిందన్న ఆనందంతో, వాడు పెద్ద అంగవేసి గుడి ముందున్న అరుగు మీదికి ఎక్కబోయాడు. అప్పుడు వాడి చూపులు యథాలాపంగా ఆ గుడిలోపలి విగ్రహం మీద పడడంతో ఉలిక్కి పడ్డాడు. అది తను నిత్యం మొక్కుకునే భైరవీ మాత విగ్రహం. ఆ మాత ఎదుట దొంగతనం చేయకూడదని తన తండ్రి చెప్పిన మాట గుర్తు రావడంతో, వాళ్ళ దగ్గరున్న సొమ్ములను ఒక్కటికూడా ముట్టుకోకుండా వెళ్ళిపోయాడు.

కొంత సేపయ్యాక ఆ రహదారిగుండా వెళుతూన్న సోమనాధం, గుడి దగ్గరి బండిని చూసి, ''ఇది మన ముత్యాలు బండిలాగు న్నదే,'' అనుకుంటూ కేక వేసి పిలిచాడు. సమాధానం రాకపోయేసరికి, దగ్గరికి వెళ్ళి చూశాడు. అక్కడ స్పృహ తప్పి పడి ఉన్న నలుగురిలో ముగ్గురు తమ ఊరి వారని తెలియడంతో, దారిన వెళ్ళే నలుగురికి విషయం చెప్పి, వారి సాయంతో ఆ నలుగు రినీ బండిలోకి ఎక్కించి పెనుగొల్లుకు తీసుకు పోయి వైద్యం చేయించాడు.

స్పృహరాగానే రంగనాధం, సోమనాధం చెప్పింది విని, ''ఈ సింహాచలం దొంగవెధవ! మాకు మత్తుమందు కలిపిన మిఠాయిలు ఇచ్చి మోసం చేశాడు. దేవుడు వీడికి తెలివి తప్పించి తగిన శాస్తి చేశాడు,'' అన్నాడు.

''అవును. పాపం చేస్తే దేవుడు ఊరుకుం టాడా?'' అన్నాడు రామనాధం. ఈలోగా చాలామంది జనం అక్కడ పోగయ్యారు.

ఆఖరుగా కళ్ళు తెరిచి వాళ్ళను చూసిన సింహాచలం, ''అవును. నేను దొంగనే. ఒప్పు కుంటున్నాను. అయితే, మీరు అనుకుంటు న్నట్టు దేవుడు నాకు స్పృహతప్పించలేదు. నా వెనక వచ్చిన ఒక దొంగ తల వెనక బలంగా కొట్టి, స్పృహకోల్పోయేలా చేశాడు,'' అన్నాడు.

ఇంతలో విషయం తెలిసి అక్కడికి వచ్చిన గ్రామపెద్ద వాడి మాట విని, ''నిజంగానే దొంగ వచ్చి వుంటే దొంగతనం చేయకుండా వెళ్ళి ఉండడు కదా? నీ మాటలు ఎవరు నమ్మ గలరు? ఇంకా ఎందుకీ అబద్ధాలు?'' అని మందలించివాణ్ణి భటులకు అప్పగించాడు.

ఇంత వరకు చెప్పిన గురువు బాలానం దుడు, ''చూశారా, సింహాచలం నిజం చెప్పినా ఒక్కరూ నమ్మలేదు. ఎందుకంటే వాడు మొదట చేసింది మోసకృత్యం. పైగా వాడొక దొంగ. ఇక మన మణిరత్నం మంచివాడేగాని పనిదొంగ. చెప్పినపని చేయకుండా తప్పించు కోవడానికి ఏవేవో అబద్ధాలు కల్పించి చెప్పే వాడు. అందుకే వాడిప్పుడు నిజం చెబుతున్నా మీరు నమ్మడం లేదు. అదీ మంచిది కాదు. వాడు చెప్పే నిజం వినండి. వాడూ నిజం మాట్లాడడానికి ప్రోత్సహించండి,'' అన్నాడు.

విద్యార్థులు సరే నన్నట్టు సంతోషంగా తల లూపారు.



# చందమామ ఇండియా క్విజ్ - 8

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

పాఠకుల కోరికకు అనుగుణంగా ప్రశ్నా విధానంలో మార్పులు చేశాం. దీని ద్వారా ఎక్కువమంది యువపాఠకులు క్విజ్‌లో పాల్గొనే అవకాశం కలుగుతుందని ఆశిస్తున్నాం.

*సరైనసమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికిసమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 8 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. నవంబర్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.

## భారతీయ సాహిత్యం



1. భగవద్గీతలో మొత్తం ఎన్ని అధ్యాయాలు ఉన్నాయి?
   ఎ. 78 బి. 18 సి. 58
2. తమిళకవి కంబన్ రామాయణాన్ని ఒక దేవాలయ ప్రాంగణంలో కూర్చుని రచించాడని చెబుతారు. ఆ దేవాలయం ఎక్కడ ఉన్నది?
   ఎ. చిదంబరం బి. రామేశ్వరం సి. శ్రీరంగం
3. రవీంద్రనాథ టాగూర్ 'గీతాంజలి'ని బెంగాలీలో రచించాడు. దానిని ఆంగ్లంలోకి అనువదించిన వారెవరు?
   ఎ. టాగూరే చేశారు బి. సరోజినీ నాయుడు సి. మధుసూదన్ దత్
4. 'ది గ్లింప్సస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' రచయిత ఎవరు?
   ఎ. మినూ మసానీ బి. అనీ బిసెంట్ సి. జవహర్‌లాల్ నెహ్రూ
5. 'మాల్గుడి' అనే కల్పిత పట్టణం ఎవరి రచనలలో వస్తుంది?
   ఎ. ఆర్. కె. నారాయణ్ బి. రస్కిన్ బాండ్ సి. ప్రేమ్‌చంద్
6. 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' అని గాంధీజీ ఎవరిని అన్నారు?
   ఎ. ఎం.ఎస్. సుబ్బులక్ష్మి బి. సరోజినీ నాయుడు సి. లతామంగేష్కర్



ఇన్ఫోసిస్ ఫౌండేషన్ చైర్‌పర్సన్ శ్రీమతి సుధానారాయణమూర్తి బహుముఖ ప్రజ్ఞావంతురాలు. సాంకేతిక నిపుణురాలుగా, ఉపాధ్యాయినిగా, రచయిత్రిగా, సంఘ సేవకురాలుగా, ఆమె వివిధ రంగాలలో ఖ్యాతి గడించారు. సర్వమానవ ప్రేమ ఆమె విశిష్ట గుణం. ఇంజనీరింగ్ విద్యలో ఆమె తొలి నుంచీ ఫస్ట్ ర్యాంక్ సాధించారు. 1974లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ నుంచి మాస్టర్స్ డిగ్రీ ఎం.టెక్ అందుకున్నారు. బంగారు, రజత పతకాలు పొందారు. పద్మశ్రీ, నాలుగు డాక్టరేట్లు, 35 వివిధ జాతీయ, అంతర్జాతీయ అవార్డులు అందుకున్నారు. నవలలు, ప్రయాణ వ్యాసాలు, సాంకేతిక గ్రంథాలు, అనుభవాలు, పిల్లల పుస్తకాలు అంటూ ఇప్పటి వరకు 92 పుస్తకాలు రచించారు. ఆమె రచనలు చాలా అవార్డులు అందుకున్నాయి.

# సుకేశిని

సుకేశిని చాలా అందమైన అమ్మాయి. సిరి మేరుగిరి కొండ దిగువన వున్న రామాపురంలో ఆమె నివసించేది. రామాపురంలో నీటి ఎద్దడి ఎక్కువ. బిందెడు నీళ్ళ కోసం గ్రామప్రజలు చాలా దూరం వెళ్ళ వలసి వచ్చేది. వ్యవసాయం సక్రమంగా జరిగేది కాదు. ప్రజలు పేదరికంతో నానా అవస్థలు అనుభవించేవారు.

సుకేశిని, ఆమె తల్లి ఒక గుడిసెలో నివసించేవారు. వాళ్ళు పేదలే కాని, చాలా కష్టపడి పని చేసేవారు. వాళ్ళకు కొన్ని గొర్రెలుండేవి. వాటిని మేపుకుంటూ జీవనం సాగించేవారు. సుకేశినికి అందమైన చాలా పొడవైన శిరోజాలుండేవి. ఆమె నడుస్తూంటే జుట్టు పాదాల వరకు జీరాడుతూ ఉండేది.

ఒకనాడు గొర్రెలకు కావలసిన గడ్డి సుకేశినికి చుట్టుపక్కల ఎక్కడా కనిపించలేదు. కొండ మీదికి వెళ్ళి గడ్డి కోసుకురావాలనుకున్నది. కష్టపడి కొండ ఎక్కి సగం దూరం వెళ్ళేసరికి బాగా అలిసిపోయి ఒక వేపచెట్టు కింద కూర్చున్నది. వేపచెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటూండగా లేత ఆకులతో ఒక వింత తీగ ఆమె దృష్టిని ఆకర్షించింది. అలాంటి తీగను ఆమె అంతకు ముందెన్నడూ చూడలేదు. ఆ తీగను గొర్రెలకు వేస్తే తింటాయన్న ఉద్దేశంతో, సుకేశిని ఆ తీగను పట్టి గట్టిగా లాగింది. ఆ తీగతో భూమికి అడుగున వున్న గుమ్మడికాయ పైకి వచ్చింది. మరుక్షణమే ఆ గుమ్మడికాయ పల్లం నుంచి బుగ్గలా నీరు పైకి చిమ్మి సుకేశిని ముఖాన్ని తడిపింది. ఆ నీళ్ళను తాగి చూసింది సుకేశిని. తియ్యగా ఉన్నాయి. ఆమె మనసు సంతోషంతో నాట్యం చేసింది. ఇంతకాలానికి నీటి బుగ్గను కనుగొన్నదన్న మాట! తన గ్రామ ప్రజలు ఈ నీళ్ళను ఉపయోగించుకుంటే వాళ్ళ నీటి సమస్య శాశ్వతంగా పరిష్కారమై పోతుంది!

ఆమె ఇలా అనుకుంటూండగా హఠాత్తుగా సుడిగాలి వీచడంతో, గుమ్మడికాయ ఎగిరి వెళ్ళి, నీటి బుగ్గకు అడ్డుగా పడి నీళ్ళు రావడం ఆగిపోయింది. ఏమి జరుగుతున్నదో గ్రహించే

లోపలే ఆమె కొండ శిఖరం మీదికి చేర్చబడింది. కొండ మీద అందమైన తటాకం కనిపించింది.

అంతలో అక్కడున్న ఒక రాక్షసుడు అమిత ఆగ్రహంతో, ''బుడిగీ! నేనీ కొండకు అధిపతిని. ఇక్కడ రెండు జలవనరులు నా అధీనంలో ఉన్నాయి. ఒకటి ఈ తటాకం. రెండవది ఆ బుగ్గ. ఇప్పుడు నీకా రహస్యం తెలిసిపోయింది. ఈ రహస్యాన్ని నీ గ్రామస్థులకు చెప్పావో, నిన్ను తెచ్చి, తటాకం కింద పాతిపెట్టి, రోజూ నీ జుట్టు మీద నీళ్ళు ప్రవహించేలా చేయగలను. జాగ్రత్త! ఇదే నీకు నా హెచ్చరిక! ఇక నువ్వు వెళ్ళవచ్చు,'' అని బిగ్గరగా అరిచాడు.

సుకేశిని సమాధానం చెప్పేలోగా ఆమెను సుడిగాలి, గ్రామంలోకి తెచ్చి పడవేసింది.

ఇవన్నీ కూడా కళ్ళు మూసి తెరిచేలోగా చకచకా జరిగిపోవడంతో అంతా కలలా అనిపించింది సుకేశినికి. అయితే, అది కలకాదు నిజమని చెప్పడానికి ఆమె చేతిలోవున్న వింత తీగ ఆకు ఒకటి గుర్తుగా నిలిచింది. ఆమె దీనిని గురించి చాలా రోజులు ఆలోచించింది. ఎలాగైనా గ్రామ ప్రజల నీటి సమస్యను పరిష్కరించాలని నిర్ణయించింది. అయితే రాక్షసుడి హెచ్చరికను తలుచుకున్నప్పుడు, ''చల్లటి నీళ్ళు ఎప్పుడూ నా జుట్టు గుండా ప్రవహిస్తూనే ఉంటాయి కదా!'' అని భయపడేది.

రోజులు, నెలలు గడిచాయి. నీటి ఎద్దడి ఎక్కువయ్యే కొద్దీ, ఆమె మానసిక వేదన కూడా ఎక్కువయింది. పట్టరాని వేదన కారణంగా ఆమె జుట్టు తెల్లబడసాగింది. కొన్నాళ్ళకు ఆమె జుట్టు పూర్తిగా తెల్లబడిపోయింది. ఆమె అందం కూడా కనుమరుగయింది.

ఒకనాడు ఆమె జబ్బు పడ్డ తల్లికీ, దప్పికతో విలవిలలాడుతూన్న గొర్రె పిల్లలకూ బిందెడు నీళ్ళు తేలేక పోయింది. వేసవి ఎండలు మండిపోతున్నాయి. ఆమె చాలా సేపు తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. మొత్తం గ్రామం మేలుకోసం తను ఒక్కతె ప్రాణత్యాగం చేయడం ఫరవాలేదనిపించింది.

మరునాడు తెల్లవారగానే గ్రామస్థులందరినీ సమావేశపరచి, జరిగినదంతా వివరించి, 'నేను మిమ్మల్ని ఆ బుగ్గ దగ్గరికి తీసుకువెళతాను,'' అన్నది.

అక్కడ చేరిన జనం నుంచి ఒకయువకుడు లేచి



నిలబడి, "మా సుఖం కోసం నువ్వు ప్రాణ త్యాగం చేయడం బాగా లేదు. అందుకు నేనొక పరిష్కారం చెబుతాను. నీలాగే ఒక కొయ్య బొమ్మను తయారు చేద్దాం. నువ్వు నీ శిరోజాలను తీసి ఇచ్చావంటే, నేను వాటిని బొమ్మ తలకు అతికిస్తాను. శిరోజాలు లేకుండా నీ ముఖం మరోలాగా ఉంటుంది గనక, నిన్ను గుర్తు పట్టడం కొత్తవారికి అంత సులభం కాదు. ఆ రాక్షసుడు కూడా నీ శిరోజాలతో ఉన్న నీ రూపం బొమ్మను తీసుకువెళ్ళి తటాకం కింద పాతి పెడతాడు. అంతే," అన్నాడు.

అది మంచి ఆలోచన అని అందరూ భావించారు. మరునాడు, మంచి దేహసౌష్ఠవంగల వాళ్ళూ, యువతీయువకులూ సుకేశిని వెంట సిరిమేరు కొండ మీదికి వెళ్ళారు. కొండ మీది వేపచెట్టునూ, వింత తీగనూ చూశారు.

"నేను గుమ్మడి కాయను లాగేలోగా మీరు ఇక్కడి నుంచి మన గ్రామం వరకు కాలువ తవ్వండి. నేను గుమ్మడి కాయను లాగిన వెంటనే దానిని పగలగొట్టి ధ్వంసం చేయండి. ఆ తరవాత దేవుడి చిత్తం!" అన్నది సుకేశిని.

గ్రామస్థులు ఆమె చెప్పినట్టే చేశారు. ఆమె తీగను లాగగానే బుగ్గ నుంచి పెల్లుబికిన నీళ్ళు కాలువ గుండా గ్రామం కేసి ఉరకలెత్తింది. మరుక్షణమే సుడిగాలిలా వచ్చి, రాక్షసుడు పొడవాటి శిరోజాలుగల బొమ్మను కొండ మీదికి తీసుకు వెళ్ళి, తటాకం కింద పాతిపెట్టాడు. అది బొమ్మ అని గ్రహించక రాక్షసుడు మరింత ఆవేశంతో, తటాకం గట్టును తెగగొట్టి శీతల జలాలు పట్టులాంటి ఆమె పొడవాటి శిరోజాల గుండా ప్రవహించేలా చేశాడు. అప్పటికీ ఆగ్రహం చల్లారని రాక్షసుడు ఆవేశంతో సిరిమేరుగిరి మీది నుంచి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

సుకేశిని తెల్లటి జుట్టు మీదుగా జారిన తటాక జలాలు కొండ పైనుంచి కింది లోయ లోకి వెండి జలపాతాల్లా ఉరకసాగాయి. ఆ జలాలు గ్రామస్థుల వ్యవసాయం సాగుకు ఉపయోగ పడ్డాయి. కాలువ జలాలూ తాగు నీరుగా ఉపయోగపడ్డాయి. అప్పటి నుంచి రామాపురం కరువు కాటకాల నుంచి రక్షించ బడింది.

సుకేశినికి మళ్ళీ ఒత్తుగా, నల్లగా, నిగనిగలాడుతూ శిరోజాలు పెరిగాయి. ఆమె నిస్వార్థ సేవకు రామాపురం ప్రజలు తమ కృతజ్ఞతలు తెలియజేసి, ఆమెను ఎంతగానో కొనియాడారు.



## ఉత్తరాఖండ్ జానపద కథ

# గొర్రెల కాపరి అదృష్టం!

ఒకానొకప్పుడు ఒకానొకమారుమూల గ్రామంలో భక్తుడైన ఒక బ్రాహ్మణుడుండేవాడు. ప్రతి మంగళ, శుక్రవారాల్లో ఆయన తన ఇంటి ఆవ రణలో పురాణ కాలక్షేపం చేసేవాడు. పురాణ కాలక్షేపం వినడానికి వచ్చే గ్రామ ప్రజలు, విన్న తరవాత తమకు తోచినది, బ్రాహ్మణుడి పక్కనే ఉన్న వెండి పళ్ళెంలో భక్తితో వేసి వెళ్ళే వారు. దాంతో ఆయన జీవనం సాగించేవాడు.

రోజులు గడిచే కొద్దీ బ్రాహ్మణుడిలో తన పాండిత్యం పట్ల, పవిత్రత పట్ల అహంకారం పెరగసాగింది. గ్రామస్థులందరిలోకీ తాను అధికుణ్ణన్న భావం ఏర్పడసాగింది. దాంతో ప్రజలతో కటువుగా ప్రవర్తించసాగాడు. వెండి పళ్ళెంలో కాసులువేయకుండా వెళ్ళేవారిని చూసి మంద లించేవాడు. పురాణకాలక్షేపం వినడానికి వచ్చిన ప్రజలు చెల్లించిన డబ్బులు, కొన్నాళ్ళకు ఆయన తీర్థయాత్రకు వెళ్ళిరావడానికి సరిపడా పోగ య్యాయి. దానిని చూసి ఆయన ఎంతగానో సంబర పడి, ఒకనాడు ఉపన్యాసం పూర్తి చేశాక, ''మీలో హరిద్వార్‌ను గురించి విన్నవాళ్ళు ఎంత మంది ఉన్నారో నాకు తెలియదు. అది ఈ భూమండలంలోని పవిత్ర తీర్థా లలోకెల్లా పవిత్రమైనది. నేను హరిద్వార్ యాత్రకు వెళుతున్నాను. యాత్ర నుంచి తిరిగివచ్చాక పురాణకాలక్షేపం ప్రారంభి స్తాను,'' అన్నాడు.

కాలక్షేపం వినడానికి వచ్చిన ప్రజలు ఒక రొకరుగా వెళ్ళిపోసాగారు. కొందరు వెళ్ళే ముందు బ్రాహ్మణుడి పాదాల ముందు సాష్టాంగ పడి మొక్కి, ఆయన నుంచి ఆశీస్సులు పొంది మరీ వెళ్ళారు. ఆఖరుగా ఒక యువకుడు చేతులు జోడించి, బ్రాహ్మణుడి ఎదుటికి వచ్చాడు. బ్రాహ్మణుడా యువకుణ్ణి గుర్తు పట్టి, ''ఏరా, కల్యాణా? ఏం కావాలి?'' అని అడిగాడు.

''స్వామీ, నేనూ మీతో పాటు మీరు వెళు



తూన్న పవిత్రమైనహరిద్వార్‌యాత్రకు రావచ్చా?'' అని అడిగాడు.

ఒక గొర్రెల కాపరి ఉన్నట్టుండి భక్తుడై పోవడం బ్రాహ్మణుడికి విస్మయం కలిగించింది. ''హరిద్వార్, పక్కనే ఏదో కూతవేటు దూరంలో ఉందనుకుంటున్నావా? చాలా దూరం వెళ్ళాలి. నువ్వు నాతో వచ్చావంటే, తిరిగివచ్చేంతవరకు నీ గొర్రెల్ని ఎవరు చూసుకుంటారు?'' అని అడిగాడు బ్రాహ్మణుడు.

''అదేం సమస్య కాదు స్వామీ. అవి తమంతట మేసేసి, సాయంకాలానికి కొట్టానికి తిరిగి రాగలవు,'' అన్నాడు గొర్రెలకాపరి.



''అలాగా! నువ్వు నాతో రావడం సంతోషమే. రేపు తెల్లవారుజామునే ప్రయాణం. అన్నీ సిద్ధం చేసుకో,'' అన్నాడు బ్రాహ్మణుడు గొప్ప ఉపకారం చేస్తున్నట్టు.

దారి పొడవునా బ్రాహ్మణుడు హరిద్వార్ పవిత్రతను గురించీ, అలాంటి పవిత్ర క్షేత్రాన్ని సందర్శించడం అందరికీ సాధ్యం కాదనీ, పుణ్యాత్ములకే ఆ భాగ్యం కలుగుతుందనీ చెబుతూ వచ్చాడు. అదంతా విన్న కల్హణుడు మౌనంగా ఊరుకున్నాడే తప్ప, బ్రాహ్మణుడిలా మాటి మాటికీ భగవన్నామాన్ని భక్తితో స్మరించలేక పోయాడు.

హరిద్వార్ చేరుతూండగా బ్రాహ్మణుడు మరింత బిగ్గరగా నామకీర్తన చేయసాగాడు. కల్హణుడిలో ఎలాంటి ఉద్వేగం లేకపోవడం చూసి ఆయన ఆశ్చర్యపోయాడు. పైగా, ఆ యువకుడు చుట్టుపక్కల ప్రకృతి దృశ్యాలను చూడ్డంలో ఆసక్తిగా ఉన్నాడు. పవిత్ర గంగానదిని దర్శించగానే బ్రాహ్మణుడు వంగి, ''అమ్మా, గంగామాతా! నీ బిడ్డను ఆశీర్వదించు తల్లీ! అద్భుతమైన ఈ రోజుకోసమే ఇన్నాళ్ళు వేచి ఉన్నాను,'' అంటూ భక్తితో నమస్కరించాడు.

అతడు లేచి నిలబడి కల్హణుడికేసి తిరిగి చూశాడు. అతడు ఎలాంటి చలనమూ లేకుండా నదీ ప్రవాహం కేసి చూస్తున్నాడు. ఇలాంటి మూర్ఖుణ్ణి ఇక్కడికి వెంటబెట్టుకు వచ్చి మహా పాపం చేశాను. ఇతర పాపాలతో పాటు ఈ పాపాన్ని కూడా ప్రక్షాళనం చేసుకోవాలి అనుకుంటూ, ''కల్హణా! నువ్వు ఇక్కడే ఉండు. పవిత్ర గంగలో స్నానం చేసి వస్తాను.

నేను వచ్చాక నువ్వు వెళ్ళవచ్చు,'' అంటూ నదిలోకి దిగాడు.

ఇప్పుడు ఆశ్చర్యపోవడం కల్లాణుడి వంత యింది. ''ఈ నదీ జలాలలో స్నానం చేయ డానికా నేను ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చాను?'' అని అన్నాడు పైకి వినిపిస్తు న్నట్టుగా.

''పాపం శమించుగాక! ఇది పరమ పావనమైన గంగానది! పవిత్రమైన నదు లన్నిటిలోకీ పవిత్రమైనది!'' అన్నాడు బ్రాహ్మణుడు కల్లాణుడి అజ్ఞానానికి నొచ్చు కుంటూ.

'నేను మన ఊళ్ళోనే ఉండి పోయి, అక్కడి నదిలోనే స్నానం చేసి ఉంటే బావుండేది. రెండు నదులకు మధ్య నాకేం తేడా కనిపించడం లేదు!'' అన్నాడు కల్లాణుడు.

'నేనిప్పుడు నీతో వాదించడానికి సిద్ధంగా లేను. పవిత్ర తీర్థ స్నానానికి వెళుతున్నాను. నీకిష్టమైన పనిచెయ్!'' అంటూ స్నానఘట్టం మెట్లగుండా నదిలోకి దిగాడు బ్రాహ్మణుడు.

వాళ్ళిద్దరి మాటలనూ విన్న గంగామాత, ''ఆ యువకుడు ప్రతి నదినీ గంగమ్మ తల్లిగా భావిస్తున్నాడు. హరిద్వార్‌లో ప్రవహిస్తూన్న ఈ నదే కాకుండా ప్రతి నదీ పవిత్రమైనదేనని అనుకుంటున్నాడు. అతణ్ణి తప్పక దీవించాలి,'' అనుకుంటూ కల్లాణుణ్ణి సమీపించి, ''నేనే గంగను. నువ్వు నన్ను గురించి చెప్పింది విన్నాను. నా భక్తులందరికన్నా నీలో చక్కటి జ్ఞానం ప్రకా శిస్తున్నది. పేర్లు వేరైనప్పటికీ నదులన్నీ పవిత్ర మైనవే. ఏదీ, నీనోరు తెరువు. జ్ఞానవాక్కులను పల్కిన నీ నాలుకను చూడాలి!'' అన్నది.

కల్లాణుడు అమాయకంగా నోరు తెరిచాడు.



గంగామాత అతడి నాలుకపై ఏదో రాసి, ''ఈ క్షణం నుంచి నువ్వు పక్షులతోనూ, జంతువుల తోనూ కూడా మాట్లాడగలవు. వాటి భాష, జ్ఞానం నీకు అర్థమవుతుంది. నీకు మహత్తరమైన భవిష్యత్తు ఉంది,'' అని దీవించింది.

కల్లాణుడు ఆశ్చర్యంగా చూస్తూండగానే ఆమె అంతర్ధాన మయింది. అతడు స్నాన ఘట్టంకేసి తిరిగి చూశాడు. అక్కడ స్నానం చేస్తున్న వారిలో తమ గ్రామం బ్రాహ్మణుడు కనిపించలేదు. చుట్టు పక్కల తిరిగి చూశాడు. బ్రాహ్మణుడి జాడ కనిపించలేదు. అతడికి గ్రామంలో తన కోసం ఎదురు చూసే తన గొర్రెలు గుర్తురావడంతో, వచ్చినపని పూర్తయింది కదా అని తిరుగు ప్రయాణమయ్యాడు.

వచ్చినప్పుడు కనిపించిన భవనాలూ, దృశ్యాలూ మళ్ళీ కనిపించడంతో సరైన మార్గం

లోనే తిరిగి వెళుతున్నానన్న నమ్మకంతో నడుస్తూన్న కల్యాణుడు ఎదురుగా పెద్ద ఊరేగింపు రావడం గమనించాడు. ఊరేగింపుకు ముందు అలంకరించబడిన ఒక ఏనుగు తొండంతో పూల మాలను పట్టుకుని వస్తున్నది.

దానిని చూడగానే కల్యాణుడు దారి ఇవ్వడానికి పక్కకు తప్పుకుని, పక్కనున్న పెద్ద మనిషిని, "ఏమిటా ఊరేగింపు?" అని అడిగాడు. ఆ ప్రాంతాన్నేలేరాజు హఠాత్తుగా మరణించాడనీ, రాజుకు సంతానం లేనందువల్ల, పట్టపుటేనుగు మాలవేసినవారే రాజు కావడం అక్కడి సంప్రదాయమనీ, అందుకే ఆ ఊరేగింపు అనీ ఆ పక్కనున్న మనిషి వివరించాడు.

ఏనుగు కల్యాణుణ్ణి సమీపించగానే, నిలబడి తొండమెత్తి గట్టిగా ఘీంకరించి, పూలదండను అతడి మెడలో వేసింది. ప్రజల కరతాళ ధ్వనుల మధ్య, ఏనుగు కల్యాణుణ్ణి, తొండంతో పైకెత్తి తన వీపుపై కూర్చోబెట్టుకున్నది. "మహారాజుకు జై... మహారాజుకు జై," అంటూ ప్రజలు నినాదాలు చేశారు.

మేళతాళాలతో ఊరేగింపు ముందుకు సాగింది.

రాజమార్గానికి ఇరువైపులా బారులు తీరి నిలబడ్డ ప్రజలలో గంగాస్నానం ముగించి వచ్చిన, కల్యాణుడి గ్రామం బ్రాహ్మణుడు కూడా ఉన్నాడు. ఆయన కల్యాణుణ్ణి వెంటనే గుర్తుపట్టలేక పోయాడు. గుర్తు పట్టాక, "ఆహా! నిన్న మొన్నటి వరకు గొర్రెల కాపరి! ఈ రోజు కల్యాణ మహారాజు! ఏమి అదృష్టం!" అంటూ ఆశ్చర్య పోయాడు.






# పుట్టిన తీరానికి!

తిరిగి రావడం నాకెంతో సంతోషంగా ఉంది. చిన్న తాబేలు పిల్లగా ఉన్నప్పుడు వేల కిలోమీటర్ల సముద్రాన్ని ఈదుకుంటూ రావడం అన్నది మాటలు కాదు. ఒక్క దూరమే కాదు. దారి పొడవునా ఎన్నెన్ని అవరోధాలు. ఎన్నెన్ని ప్రమాదాలు. సముద్రంలో ఎదురుపడ్డ దాన్నంతా లాగేసుకోవాలని చేపలుపట్టే నావలు విసిరే పెద్ద పెద్ద వలలు; హతమార్చే మోటార్‌బోట్ల ప్రొపెల్లర్లు; అడపాదడపా తారసపడే ప్రాణాంతకాలైన తిమింగిలాలు. ఇవన్నీ మమ్మల్ని ఒంటరి వాళ్ళను చేస్తున్నాయంటే అబద్ధంకాదు. బహుశా పెద్ద జలచరాలు మమ్మల్ని మింగేస్తే వాటి కడుపులు జీర్ణించుకోకుండా అవస్థ పెట్టే మా చిప్పల వల్ల, అవి మా జోలికి రావడం లేదనుకుంటాను. మా వీపుల మీది దృఢమైన కవచాలు అదే మీరు తాబేటి చిప్పలంటారు చూడండి. అవే మమ్మల్ని కాపాడుతున్నాయి.

అవునూ, తిరిగి రావడం నాకెంతో సంతోషంగా ఉందని చెప్పాను కదూ. ఈ అందమైన తీరాన్ని వదిలి ఎప్పుడు వెళ్ళానో నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు గాని, ఎంత కాదన్నా అది పాతిక, ముప్పై ఏళ్ళనాటి మాట. అప్పుడేనేను పుట్టాను. అసంఖ్యాకమైన నక్షత్రాలతో, సగం చందమామ గల అందమైన ఆకాశం కింద చాలా మంది అక్కచెల్లెళ్ళతో, అన్నదమ్ములతో ఉండేదాన్నన్న సంగతి మాత్రం నాకింకా జ్ఞాపకం ఉంది. దూరంగా కనిపించే నల్లటి తీరాన్ని చేరుకోవాలని ఉబలాటపడేవాళ్ళం. అలలతో నేను పుట్టిన తీరాన్ని తాకుతూన్న సముద్రం అది!

సముద్రతీరంలో మా తల్లి తయారు చేసిన గూట్లో పుట్టిన చాలా మంది పిల్లల్లో నేనూ ఒకతెననుకుంటాను. గూడంటే పక్షులు కట్టే గూడులాంటిది కాదు. తల్లితాబేళ్ళు గుడ్లు పెట్టడానికి ఇసుకలో చేసే బొరియల్లాంటి గోతులన్న మాట. వాటిలోనే అవి గుడ్లు పెడతాయి. అలా పెట్టిన ఒక గుడ్డు నుంచే నేను పుట్టి, రెండడుగుల లోతు నుంచి ఇసుకను తోసుకుంటూ బయటికి వచ్చానని మా పిన్నమ్మ చెబుతూ ఉంటుంది. (ఆమెకు నాకు రెండింతల వయసు. అందువల్ల ఇలాంటి విషయాలు చాలా తెలిసుంటుంది.) నా తల్లిని గురించి నాకేమీ తెలియకపోవడం చాలా విచారకరం. గుడ్లు పెట్టిన వెంటనే, తల్లితాబేళ్ళు బొరియలను ఇసుకతో మూసేసి సముద్రంలోకివెళ్ళిపోతాయని మా పిన్నమ్మ చెప్పింది. నాకు యుర్రిడ్ అనే పేరు పెట్టింది కూడా ఆ పిన్నమ్మే.



వారని మా పిన్నమ్మ చెప్పింది. గూళ్ళు కనిపించగానే జాగ్రత్తగా అందు లోని గుడ్లను వెతికి తీసుకుని తమ ఇళ్ళ దగ్గరున్న సుర క్షిత ప్రాంతాలకు చేర్చేవారట. గుడ్లను భద్రపరచే స్థలం చుట్టూ కంచె ఏర్పాటుచేసి కాపాడే వారట. అక్కడి ఇసు కలో గుడ్లను పాతిపెట్టి పిల్లల కోసం ఎదురుచూసేవారు. అలా కాపాడ బడిన గుడ్లలో నేనూ ఒక దాన్ని! అలాంటి మంచి మనుషులు లేకుంటే, ఏదో ఒక రెస్టారెంట్‌లో టర్టిల్ ఎగ్‌సూప్‌గా నా బతుకు ఎప్పుడో పరి సమాప్తమైపోయి ఉండేది!

ఈ సుదీర్ఘ ప్రయాణంలో ఆమె నాకు చెప్పిన నమ్మలేని నిజాలు చాలా చాలా ఉన్నాయి. వాటిలో ఒకటి చూడండి: నేను పుట్టినప్పుడు మరీ చిన్నదిగా, అప్పుడే పుట్టిన మీ తమ్ముడు, చెల్లాయి అరచేతిలో ఇమిడి పోయేంత పరి మాణంలో ఉండేదాన్నట. ఇప్పుడేమో నేను మూడడుగుల పొడవుతో మీ బడిలోని బల్లంత ఉన్నాను. నా బరువెంతో తెలుసా? 6 0 కిలోలు!

అయితే, నాకు మహా ఇష్టమైన విషయం ఏమిటంటే నన్ను కాపాడిన మనుషుల గురించి చెప్పడం. మీరు గోవా అంటారు చూడండి. అదే నా జన్మస్థలం. నేను పుట్టినప్పుడు, కొందరు మనుషులు తాబేళ్ళ వేట కోసం వచ్చినట్టుంది. (తాబేళ్ళ మాంసం తింటారటవాళ్ళు. మేము అంత రుచిగా ఉంటామా?) తాబేళ్ళ గుడ్లను కూడా తినడానికి దొంగిలిస్తారు. అలాంటి పని జరక్కుండా చూడడానికి కూడా కొందరు మను షులుండడం మా అదృష్టం!

అలాంటి బృందానికి చెందిన మనుషులు కొందరు తాబేటి గూళ్ళను గుడ్ల కోసం గాలించే

ఇప్పుడు నేను నా పుట్టిన తీరానికి మళ్ళీ తిరిగివచ్చాను. నేను ఎక్కడో హిందూమహా సముద్రంలో, మీరు శ్రీలంక అంటారే ఆ ప్రాంతా నికి అవతల ఉండేదాన్ని. మేము పుట్టినవెంటనే, సముద్రంలోకి ఈదుకుంటూ వెళ్ళిపోతాం. జీవన విధానాలను తెలుసుకుంటూ పెరు గుతాం. కొంతకాలానికి తీరానికి తిరిగి రావాలనే కోరిక మాలో బలంగా కలుగుతుంది. పిన్నమ్మ లతో, అక్కాచెల్లెళ్ళతో పుట్టిన స్థలాలకు వస్తాం.

నేను తీరంలో అడుగు పెట్టగానే, నాకన్నా ముందుగా తీరం చేరిన నా బంధుమిత్రులు నన్ను చుట్టుముట్టాయి. అవినాకొక సంతోష కరమైన వార్తను చెప్పాయి. ఈ తీరమంతా ఆలివ్ రిడ్లీ టర్టిల్ అనే మా జాతి తాబేళ్ళ పరి రక్షిత ప్రాంతంగా ప్రకటించబడిందట. దానిని ఇక్కడి మత్స్యకారులూ, అటవీ శాఖ అధికా



## మన దేశం క్విజ్

### రచయితలు-వారి రచనలు

1. మొట్టమొదటి జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ఎవరు? ఏ భాషలో ఆయన రచించారు?

2. ఈ గ్రంథంలోని రాజుల చరిత్రే, మన దేశంలో నమోదు చేయబడిన మొట్టమొదటి చరిత్రగా పరిగణించబడుతున్నది. ఆ గ్రంథం పేరేమిటి?




3. 'షేక్స్‌పియర్ ఆఫ్ ఇండియా' అని కీర్తి గడించిన వారెవరు?

4. రచయిత జైలులో ఉన్నప్పుడే "ది గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" పూర్తిగా రచించాడు. ఆ రచయిత ఎవరు?

5. 'లైఫ్ డివైన్' రచయిత ఎవరు? ఆయన వేరొక సుప్రసిద్ధ గ్రంథం ఏది?

*(సమాధానాలు 66వ పేజీలో)*

రులూ కలిసి పర్యవేక్షిస్తారట. ఇకపై ఇతరులు మమ్మల్ని చంపుతారనిగాని, మా గుడ్లను దొంగిలిస్తారనిగాని భయం లేదన్నమాట.

ఆ మాటవిని సంతోషిస్తూన్న నా మనసులో ఉన్నట్టుండి విషాదం ఆవరించింది. అప్పుడప్పుడు మమ్మల్ని వేధించే మనుషుల మీద పట్టరాని ఆగ్రహం కూడా కలిగింది. నా సన్నిహిత నేస్తం ఉల్వియా నా మనసులో కదలాడింది. ఉల్వియా, నేనూ మరి కొందరితో కలిసి పుట్టినింటికి బయలుదేరుతూ ఎలా వెళ్ళాలో దారి చెప్పమని మా పిన్నమ్మలాంటి పెద్దలను అడిగాం. వాళ్ళేమో మీకు ఎటు వెళ్ళాలని తోస్తే అటు వెళ్ళండి అన్నారు. మేము అలాగే బయలుదేరాం. నేను వచ్చి చేరాను. కాని నా ప్రియనేస్తం ఉల్వియా మార్గమధ్యంలో సముద్రంలో ట్రాలెర్ నెట్‌లో చిక్కుకున్నది. పాపం అది వలను కొరికి బయటపడడానికి ఒక గంటసేపుకు పైగా పోరాడింది. ఉపరితలానికి వచ్చి ఊపిరి పీల్చుకునే వీలులేక ఆఖరికి ప్రాణాలు విడిచింది. అది నన్ను చూసిన చివరి చూపు మరిచిపోలేకుండా ఉన్నాను. ఆ చూపు విషాద పూరితమేగాని, "నేను రా లేను. నువ్వు తప్పక చేరాలి," అని ప్రోత్సహించే విధంగా తోచింది.

నేను చేరాను. అయితే, అంత త్వరగా కాదు. నా కడుపు పగిలిపోయేలా ఉంది. నా బంధుమిత్రులకు దూరంగా వెళ్ళి గొయ్యి తవ్వడానికి చోటు చూసుకోవాలి. ఎందుకా? మీకు చెప్పనే లేదు కదూ? ఇప్పుడు నా సొంత గుడ్లు నా కడుపునిండా ఉన్నాయి. వాటిని పెట్టడానికి సిద్ధంగా ఉన్నాను! మీరూ గోవాలోని మన మానవ మిత్రులతో కలిసి నా పిల్లల్ని కాపాడగలరని విశ్వసిస్తున్నాను!

–ఆషిష్ కొఠారి

మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (21)

# మళ్ళీ తన నాగలి వద్దకు!

దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వం జరిగిన ఉదంతం ఇది. ఆ ప్రాచీన కాల ఘట్టం లోనే పాశ్చాత్య రోము దేశంలో ప్రజాస్వామ్యం వెలిసింది. తూర్పు దేశాలకు వస్తే ఉత్తర భారత దేశంలో కొన్ని చిన్న చిన్న రాజ్యాలలో ప్రజా స్వామ్యపాలనకు ప్రయత్నాలు జరిగాయి.

ప్రధాన వృత్తి వ్యవసాయమే అయినప్పటికీ అప్పటి రోము దేశంలోని పురుషులందరూ యుద్ధ విద్యలలో ఆరితేరినవారే. అవసరాలు పరిమితం కావడం వల్ల వాటికోసం ప్రభుత్వం మీద ఆధారపడకుండా తామే స్వయంగా సమకూర్చుకునేవారు. రాజ్యంలోని చిన్న సైన్యం తరచూ శిక్షణ పొందుతూ ఉండేది.

ఒకసారి రోమను సైనికులు శిక్షణకోసం ఒక కొండ పాదతలంలో విడిది చేసి ఉన్నప్పుడు, రాత్రి సమయంలో శత్రుసేనలు హఠాత్తుగా వారిని చుట్టుముట్టాయి. తెల్లవారింది. శత్రువులు తమ సేనలను హతమార్చి, తమ రాజ్యాన్ని దోచుకుని, తమను బందీలుగా పట్టుకుపోయి పొరుగు రాజ్యాలలో విక్రయించగలరని ప్రజలు భయపడ్డారు.

రోమన్ అసెంబ్లీ సమావేశమై, "పట్టుబడిన రోమను సైనికులను చంపడానికి ప్రయత్నించకండి. వాళ్ళు ఎదురుదాడి జరిపితే ఉభయ పక్షాలకూ ప్రాణనష్టం వాటిల్లవచ్చు. ఒక్క రోజు ఓపిక పడితే రోమన్ అసెంబ్లీ, శత్రువులకు తమ రాజ్యం లొంగిపోయే విషయం గురించి నిర్ణయం తీసుకోగలదు," అని శత్రు సేనలకు సందేశం పంపింది.

ఇది శత్రుసేనలకు ఉత్సాహం కలిగించింది.

## చందమామ ఇండియా క్విజ్-6 (జూలై 2007) సమాధానాలు

1. తక్షశిల (క్రీ. శ. 700); నలంద (క్రీ.శ. 300).
2. వారణాసిలోని సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయం. అరుదైన ప్రపంచంలోనే అధికమైన 1,50,000 తాళపత్ర గ్రంథాలు ఇక్కడ ఉన్నాయి.
3. పండిట్ మదన్ మోహన్ మాలవ్యా - కాశీ హిందూ విశ్వవిద్యాలయం.
4. బాంబే, కలకత్తా, మద్రాసు విశ్వవిద్యాలయాలు. 1857లో.
5. మాల్కమ్ ఎస్. ఆదిశేషయ్య. మద్రాసు విశ్వవిద్యాలయం (1975-78) డెప్యూటీ డైరెక్టర్ జనరల్ ఆఫ్ యునెస్కో.
6. సిమ్లా. హిమాచల ప్రదేశ్.
7. సర్ ఎ. రామస్వామి మొదలియార్, కేరళ విశ్వవిద్యాలయం (1951-61); సర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్. మద్రాసు విశ్వవిద్యాలయం. 27 సం.లు.

ఎలాగైనా తమకే మేలు జరుగుతుం దన్న దృఢ విశ్వాసంతో, రోమన్ సైని కులను తమ వలయంలోనే ఉంచు కుని, తక్కిన సైనికులు ఆ రోజంతా వినోదాలతో గడిపారు.



ఈ విపత్కర పరి స్థితిని గురించి-ప్రజల ఆదరాభిమానాలకు పాత్రు డైన సిన్‌సినాటస్ అనే రైతును సంప్రదించాలని రోమన్ అసెంబ్లీ నిర్ణయిం చింది. అసెంబ్లీ సభ్యులు ఆయన్ను చూడడానికి వెళ్ళినప్పుడు సిన్‌సినాటస్ పొలం దున్నుతున్నాడు. వారిని చూడగానే ఆయన నాగలిని, ఎడ్లను పొలం లోనే వదిలి వారి దగ్గరికి వచ్చాడు.

ఆయన తమ రాజ్యంలోని దృఢకాయు లను పిలిచి, ఒక్కొక్కరూ ఒక్కొక్క కొయ్య పలకను పట్టుకురమ్మని ఆదేశించాడు. లేని వారిని తయారు చేసుకుని తెమ్మన్నాడు. రాత్రి అయింది. వాళ్ళందరూ ఒక్కసారిగా వెళ్ళి కొండ దగ్గరి తమ సైనికులను బందీలుగా చేసిన, శత్రుసేనలు గాఢనిద్రలో ఉన్నప్పుడు పలకలను ముందు పట్టుకుని వారిని చుట్టు ముట్టారు. నిమిషాలలో శత్రుసేనల చుట్టూ ఒక గోడ తయారయింది.

తెల్లవారింది. నిద్ర లేచిన శత్రుసైనికులు జరిగిన దానిని చూసి దిగ్భ్రాంతి చెందారు. వెలుపల తమ చుట్టూ ప్రజాసైనికుల గోడ; లోపల యుద్ధానికి సిద్ధంగా ఉన్న సుశిక్షితు లైన సైనికులు. లోపలికీ, వెలుపలికీ ఎటూ వెళ్ళలేని పరిస్థితి ఏర్పడిందని వాళ్ళు గ్రహించారు. ఇక చేసేది లేక సిన్‌సినాటస్ ఆజ్ఞానుసారం లొంగి పోయారు. అందరూ బందీలయ్యారు.

వాళ్ళందరినీ విచారణకు అసెంబ్లీకి నడిపి స్తూండగా, సిన్‌సినాటస్ తన పొలం కేసి బయలుదేరాడు. ''అయ్యా, సిన్‌సినాటస్! తమరిని మా పాలకుడిగా చేసుకోవాలని మేమం దరం నిర్ణయించాం. మాతో రండి,'' అన్నారు అసెంబ్లీ సభ్యులందరూ ఒక్కసారిగా. అయితే, సిన్‌సినాటస్ వాళ్ళు ఏం చెబుతున్నారని కూడా చెవిని వేసుకోకుండా తిన్నగా పొలం కేసి అడు గులు వేశాడు. మళ్ళీ ఎప్పటిలా నాగలి పట్టి పొలం దున్నడం ప్రారంభించాడు. ఆయనలో అధికారం పట్ల ఎలాంటి చలనమూ కలగలేదు. ప్రజాస్వామ్యం నియంతృత్వానికి దారితీయడం ఆయన ఆశించలేదు. -(ఎం.డి)



# జ్ఞానోదయం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తుండగా బోధిసత్వుడు కోసలరాజుగా జన్మించాడు. ఆయనకు సత్యసేనుడని ఒక కుమారుడుండేవాడు. యుక్తవయసు రాగానే రాజు సత్యసేనుణ్ణి యువరాజుగా చేశాడు. యువరాజు భార్య శంబులాదేవి అపురూప సౌందర్యవతి. మంచి గుణవంతురాలు.

దురదృష్టవశాత్తూ యువరాజుకు భయంకరమైన కుష్ఠువ్యాధి వచ్చింది. ఎంతమంది వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆ వ్యాధి లొంగక ఆనాటికానాడు ఎక్కువ కాసాగింది. అటువంటి భయంకరమైన వ్యాధి పెట్టుకుని నలుగురి మధ్యా ఉండటానికి నామోషీ వేసి, యువరాజు తండ్రి అనుమతితో, నిర్జనారణ్యంలో ఉండటానికి బయలుదేరాడు. అప్పుడు శంబులాదేవి కూడా తన భర్త వెంట వనవాసానికి బయలుదేరింది. యువరాజు వద్దని ఎన్ని విధాల చెప్పినా ఆమె ఏమాత్రం వినలేదు.

అరణ్యంలో జలసమృద్ధీ, ఫలసమృద్ధీ ఉన్న చోట యువరాజు ఒక పర్ణశాల నిర్మించుకుని అందులో ఉండసాగాడు. శంబులాదేవి ఉదయమే లేచి ఇంటి పనులన్నీ చేసి, భర్తకు పలుదోము పుల్లా, నీళ్ళూ ఇచ్చి, అతను ముఖం కడుక్కున్నాక తినటానికి పళ్ళు ఇచ్చి, తట్టా గునపమూ తీసుకుని అడవిలోకి వెళ్ళేది. పళ్ళూ కందమూలాలూ తెచ్చేది. కొలను నుంచి నీరు తెచ్చేది. భర్తచేత స్నానం చేయించేది. తరవాత భర్తకు భోజనం పెట్టి తాను భోజనం చేసేది. ఈ విధంగా ఆమె అహోరాత్రాలు అత్యంత శ్రద్ధగా భర్తను కనిపెట్టి ఉంటున్నది.

ఒకనాడామె పళ్ళకోసమని కొత్తవైపుగా బయలుదేరింది. కొంతదూరం వెళ్ళేసరికామె

జాతక కథ

కొక కొండకోన కనిపించింది. ఆ కోనలో కోనేరు ఒకటున్నది. దాన్ని చూడగానే ఆమెకు అందులో స్నానం చెయ్య బుద్ధి పుట్టింది. ఆమె అందులో స్నానం చేసి బయటికి వచ్చే సరికి ఆమె శరీరం మేలిమి బంగారు చాయతో ప్రకాశించసాగింది.

ఈ సంగతి ఆమె గమనించలేదు గాని, ఆ సమయానికి అటుగా పోతున్న కిరాతుడొకడు ఆమెను చూసి నిర్ఘాంతపోయి ఆగాడు. వాడు ఆమెను తన గూడానికి రమ్మనీ, తనను పెళ్ళాడమనీ బతిమాలాడు. ఆమె దారికి అడ్డు నిలబడి కదలనివ్వలేదు. ఇది చూసి శంబులాదేవి, ''ఓరీ, పాపాత్ముడా! నాశనమై పోతావు!'' అంటూ బిందెలో నీరు వాడి మీద చల్లింది. పిడుగుదెబ్బ తిన్నవాడల్లే వాడు పడిపోయాడు.

కిరాతుడి బెడద వదిలించుకుని నీరూ, పళ్ళూ తీసుకుని పర్ణశాలకు వచ్చే సరికి చాలా పొద్దుపోయింది. భర్త, ''ఇంత అలస్య మయిందేం?'' అని అడిగాడు.

శంబులాదేవి జరిగినదంతా చెప్పింది. కాని భర్త నమ్మక, ''ఆడవాళ్ళు ఎన్నయినా కల్పించగలరు! ఎక్కడ తిరిగినా నిన్ను అడిగేవాళ్ళు లేరు!'' అన్నాడు.

''స్వామీ, నేను చెప్పేది సత్యమైతే మీ వ్యాధి ఈ నీటితో నయమైపోవాలి!'' అంటూ బిందెతో తెచ్చిన నీరు భర్తకు అభిషేకం చేసింది. వెంటనే, ఇంద్రజాలం లాగా, అతని వ్యాధి తుప్పురాలినట్టు రాలిపోయి, అతని శరీరం కూడా బంగారం లాగా మెరవసాగింది. తన భార్య పాతివ్రత్యం కంటె, తనకు వ్యాధి నయమయిందన్న విషయం సత్యసేనుడికి



ఎక్కువ ఆనందం కలిగించింది. అతను వెంటనే బయలుదేరి కోసల రాజధానీ నగరానికి వచ్చి ఉద్యానవనంలో విడిది చేసి తన రాకను గురించి తండ్రికి కబురు చేశాడు.

రాజుగారు స్వయంగా ఛత్రచామరాలతో బయలుదేరి ఉద్యానవనానికి వచ్చి, తన కుమారుడికి స్వాగతం చెప్పాడు. యువరాజు వ్యాధి నయం కావటానికి గాను సహాయపడినందుకూ, అతనితో సమంగా అరణ్యవాసం చేసినందుకూ, శంబులాదేవికి పట్టపురాణి హోదా ఇస్తూ ఉత్తరువు చేశాడు. తాను వానప్రస్థం స్వీకరించి సత్యసేనుడికి రాజ్యాభిషేకం చేసేశాడు.

తండ్రి ఉత్తరువు ననుసరించి సత్యసేనుడు శంబులాదేవిని పట్టపురాణిగా చేసుకున్నాడే గాని, ఆమెపట్ల పూర్తిగా ఉదాసీనుడై తన ఇతర భార్యలతోనే ఎక్కువగా కాలం గడపసాగాడు. భర్త అనాదరణవల్లా, సవతుల ఈర్ష్య వల్లా శంబులాదేవి చిక్కి శల్యమై పోయింది.

ఇలా వుండగా ఒకనాడు మామగారు శంబులాదేవి ఇంటికి భోజనానికి వచ్చాడు. ఆమె స్థితికి ఆశ్చర్యపడి, ''ఎందుకు ఇలా కృశించిపోయావు?'' అని అడిగాడు.

''భర్త ఆదరణ లేని భార్య ఇంకెలా ఉంటుంది?'' అన్నది శంబులాదేవి.

వృద్ధరాజు జరిగినదంతా విని సత్యసేనుణ్ణి పిలిపించి, ''నాయనా, కృతఘ్నత కంటే మహాపాతకం ఇంకొకటి లేదు. భయంకరమైన వ్యాధితో నువ్వు మనుషుల మధ్య ఉండలేక అరణ్యానికి పారిపోయినప్పుడు నీ వెంట వుండి, రాత్రింబగళ్ళు నీకు సేవచేసి, చివరకు నీ వ్యాధి కూడా నయం చేసిన భార్యను, రాజ్యం చేతికి చిక్కగానే తృణీకరిస్తావా? ఈ రాజ్యాలూ, వైభవాలూ ఎవరికైనా లభిస్తాయి. కాని పతివ్రత అయిన భార్య ఎవరో అదృష్టవంతుడికిగాని లభించదు. కనక శంబులాదేవిని అనాదరంతో చూడకు. అందువల్ల నష్టపడేది నువ్వే!'' అని బోధించాడు.

సత్యసేనుడు జ్ఞానోదయం కలిగినవాడై భార్యకు క్షమాపణ చెప్పుకుని, ఆమెకు తనపైనా తన ఇతర భార్యల పైనా అంతులేని అధికారాలిచ్చి, ఆమెను ఆదరంతో చూస్తూ కాలం గడిపాడు.





# రామాయణం

తరవాత రావణుడు అంతఃపురం నుంచి బయటికి వచ్చి జట్టీలలాటి ఎనిమిదిమంది రాక్షసులను పిలిచి, ''మీరు అన్ని రకాల ఆయుధాలూ పట్టుకుని జనస్థానానికివెళ్ళాలి. ఒకప్పుడక్కడ ఖరుడుండేవాడు. అక్కడి రాక్ష సులంతా చావటం చేత ఇప్పుడెవరూ లేరు. ఖర దూషణులనూ, రాక్షస సేననూ రాముడు దుర్మార్గంగా చంపేశాడు. ఆ రాముడికీ మనకూ మధ్య ఇప్పుడు గొప్ప వైరం ఏర్పడింది. అందు చేత ఆ రాముణ్ణి చంపేదాకా నేను నిద్ర పోను. ఈ లోపుగా మీరేం చెయ్యాలంటే, ఆ జనస్థానంలో ఉండి, రాముడు ఎప్పుడేం చేసేదీ నాకు ఎప్పటికప్పుడు తెలుపుతూ ఉండాలి. మీరు ఒక్క క్షణం కూడా ఏమరు పాటన్నది లేకుండా, రాముణ్ణిచంపే ప్రయత్నం లోనే ఉండాలి. అద్భుతమైన మీ బలపరాక్ర మాలు నేను అనేకపర్యాయాలు ప్రత్యక్షంగా చూశాను గనక, మీకీ పని అప్పగిస్తున్నాను,'' అని చెప్పాడు.

రాక్షసులు వెళ్ళిపోయారు. తరవాత రావణుడి బుద్ధి సీత మీదికి వెళ్ళింది. అతను త్వరగా తన అంతఃపురానికి తిరిగి వచ్చి, రాక్షసస్త్రీల మధ్య కూచుని దుఃఖ సము ద్రంలో మునిగి ఉన్న సీతను చూశాడు. సీత వద్దు మొర్రో అంటున్నా వినకుండా అతను సీతను బలవంతంగా తీసుకుపోయి తన భవనమంతా చూపించాడు. అది అత్యంత సుందరమైన దేవతాగృహాలలాటిది. అందులో అనేకవేల మంది స్త్రీలున్నారు. రకరకాల పక్షులున్నాయి. ఎక్కడ చూసినా రత్నాలూ,

అరణ్యకాండ – 6



మణులూ మాణిక్యాలూ, దంతంతో చేసిన భాగాలూ, స్ఫటికశిలలూ, వెండితో చేసినవీ, వజ్రవైడూర్యాలు తాపడం చేసిన అందమైన స్తంభాలూ ఉన్నాయి. బంగారు ద్వారం గల అద్భుతమైన మెట్ల వరస మీదుగా ఇద్దరూ ఎక్కారు. మెట్ల పక్కన వెండి కిటికీలూ, దంతపు కిటికీలూ ఉన్నాయి. మేడ మీద బంగారు కిటికీలున్నాయి. కొన్నిచోట్ల గోడలో రత్నాలు పొదిగారు. తులలేని తన ఐశ్వర్యంతో సీతను భ్రమింప జెయ్యటానికిగాను రావణుడు ఇవన్నీ సీతకు చూపాడు.

అతను సీతతో, ''నువ్వు నాకు ప్రాణంకన్న ఎక్కువైన దానివి. నా భార్యవయ్యావో నా మిగతా భార్యలందరికీ రాణిని చేస్తాను. ఈ మహానగరం దేవతలకు కూడా గెలవరానిది. నిన్ను ఇక్కడి నుంచి తీసుకుపోగలవాడు మూడు లోకాలలోనూ లేడు. నన్ను కూడా దాసుడుగా చేసుకుని ఈ లంకా రాజ్యాన్ని నువ్వే ఏలు. ఎప్పుడో ఏదో పాపం చేసి ఇంత వరకు వనవాసం అనుభవించావు. ఇక నీ పుణ్యం అనుభవించు. విమానంలో మనం ఇష్టం వచ్చినట్టు విహరింతాం. దుఃఖిస్తుంటే నీ అందమైన ముఖం కళాహీనంగా ఉన్నది. అందుచేత విచారం మాను!'' అన్నాడు.

ఇంత చెప్పినా సీత చలించలేదు. ఆమె తనకూ రావణుడికీ మధ్య ఒక గడ్డిపోచ అడ్డంగా పట్టుకుని, అతని కేసి చూస్తూ, ''నాకు ఒకడే దేవుడు. అతడు నా భర్త అయిన రాముడు. అతని చేతిలో నీకు చావు రాసిపెట్టి ఉన్నది. ఈ లంకకు వైధవ్యప్రాప్తి తప్పదు. నా శరీరాన్ని బంధించు, కోసుకుతిను గాక, నేను పాతివ్రత్య భంగం సహించను,'' అని జవాబిచ్చింది.

రావణుడు మండిపడి, ''అయితే నా మాట విను. నీకు పన్నెండు మాసాలు గడు విచ్చాను. ఈ లోపుగా నువ్వు నా కోరికను ఆమోదించకపోతే నా వంటవాళ్ళచేత నిన్ను ముక్కలు ముక్కలుగా కోయించి ఫలహారం వండిస్తాను!'' అన్నాడు.

తరవాత అతను రాక్షసస్త్రీలను పిలిచి, ''ఈమెను అశోకవనానికి తీసుకుపోయి మీరంతా చుట్టూ ఉండి జాగ్రత్తగా రక్షించండి. నయానో భయానో ఈమెను దారికి తీసుకు రండి,'' అని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రకారమే రాక్షసస్త్రీలు సీతను అశోకవనానికి తీసుకువెళ్ళారు. ఆ వనంలోని చెట్లు

ఎల్లప్పుడూ పూలతోనూ, పళ్ళతోనూ నిండి ఉంటాయి. వనం నిండా పక్షులున్నాయి. రాక్షసస్త్రీలు సీతను అక్కడికి చేర్చి చుట్టూ కూచున్నారు. ఆమెకు దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. ఆమె రాముణ్ణి తలుచుకుని దుఃఖం పట్టలేక మూర్ఛపోయింది.

అక్కడ రాముడు మాయలేడి రూపంలో వచ్చిన మారీచుణ్ణి చంపి ఆశ్రమానికి తిరిగి వస్తూండగా వెనక నుంచి నక్క ఒకటి కూసింది. ఈ దుశ్శకునంతో కలవరపడి రాముడు, "సీతను ఏ రాక్షసులో తిని ఉండరు గద!" అని భయపడ్డాడు. లేడి రూపంలో ఒక రాక్షసుడు వచ్చి తనను ఆశ్రమానికి దూరంగా తీసుకుపోవటమూ, చూస్తూ కూడా వాడు తన గొంతుతో ఆర్తనాదం చెయ్యటమూ చూస్తే తనకేదో ద్రోహం తలపెట్టి రాక్షసులు పన్నాగం చేశారని అతనికి నమ్మకం కలిగింది. సీతకు లక్ష్మణుడు రక్షగా ఉన్నాడన్న ధైర్యం అవలంబించేటందుకు కూడా అవకాశం లేకుండా ఆ లక్ష్మణుడే తనకు ఎదురువస్తూ కనిపించాడు!

రాముడి ఆందోళన రెట్టింపయింది. అతను లక్ష్మణుడి చెయ్యి పట్టుకుని, "ఇదేమిటి, లక్ష్మణా! సీతను ఆశ్రమంలో ఒంటిగా విడిచి వచ్చావా? సీతను మళ్ళీ మనం ప్రాణాలతో చూస్తామా? సీతకు ఏమన్నా జరిగిందో నా ప్రాణాలు నిలవవు! నేనుపోయాక నువ్వు అయోధ్యకు తిరిగిపోతే, కైకేయి తన కోరిక పూర్తిగా ఫలించినందుకు సంతోషిస్తుంది కాబోలు! ఆ రాక్షసుడి కేకకు శూరుడవైన నువ్వు



కూడా భయపడ్డావా? నేను ఖరదూషణాది రాక్షసులను చంపానేమో, వారు పగపట్టి ఉన్నారు; సీతను తప్పక చంపేస్తారు. లక్ష్మణా, నాకు అపశకునాలు కనిపిస్తున్నాయి. దుఃఖంలో మునిగి ఏమీ చేయలేని స్థితిలో పడ్డాను," అన్నాడు.

లక్ష్మణుడు సీత అన్న కఠోరవచనాలు వివరించి చెప్పి, ఆ పరుషాలు సహించలేక బయలుదేరి వచ్చానన్నాడు.

"సీత అజ్ఞానం చేత ఏవేవో అన్నదని ఆగ్రహించి నువ్వు నా ఆజ్ఞను ఉల్లంఘించటం చాలా తప్పు! నాకే ప్రమాదమూ రాదని తెలిసిన వాడవు సీత వెంటనే ఉండవలిసింది," అన్నాడు రాముడు.

రాముడు భయపడ్డంతా అయింది. సీత పర్ణశాలలో లేదు. ఆమె మామూలుగా తిరిగే



చోట్లలో కూడా లేదు. ఆశ్రమం బావురుమంటు న్నది. అతనికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతను సీత కోసం వెతుకుతూ అడవినపడ్డాడు. ''సీత ఎక్కడ ఉన్నది?'' అని అరణ్యవృక్షా లను పేరుపేరునా అడిగాడు. దుఃఖాతిశ యంతో అతనికి మతి పోయింది. అంత దూరాన సీత కనిపించినట్టూ, తనకు అంద కుండా పారిపోతున్నట్టూ, భ్రమ కలిగింది; సీతను కేకపెట్టి పిలిచాడు. ఉన్నట్టుండి అత నికి సీత ఎక్కడో దాక్కుని తనను ఏడిపిస్తున్న దన్న అనుమానం వచ్చింది; కనిపించమని ఆమెను వేడుకున్నాడు.

లక్ష్మణుడు రాముడి దీనస్థితి గమనించి, ''అన్నా, దుఃఖించి లాభంలేదు. చుట్టు పక్కల అరణ్యమంతా వెతుకుదాం. సీత ఎంతోదూరం వెళ్ళి ఉండకపోవచ్చు,'' అని ధైర్యం చెప్పాడు. పరిసరారణ్యమంతా ఎంత వెతికినా వారికి సీత జాడ తెలియలేదు. రాము డికి మళ్ళీ అధైర్యం పట్టుకున్నది; అతని దేహంలో శక్తి లేకుండా పోయింది. అతను నిస్త్రాణగా ఒక చోట కూలబడిపోయాడు.

అన్న సీతను తలుచుకుని పెద్దపెట్టున శోకాలు పెట్టుతూండటం చూసి లక్ష్మణుడు అతన్ని ఓదార్చటానికి ఎంతగానో ప్రయత్నిం చాడు. కాని ఆ మాట లేవీ రాముడి చెవి కెక్కలేదు. అతను లక్ష్మణుడితో, ''సీతను రాక్ష సుల పాలుకానిచ్చిన నన్ను లోకం నిర్వీర్యుడి కింద జమ కడుతుంది. సీత లేకుండా నేను అయోధ్యకెలా వెళతాను, సీత లేని శూన్యాంతః పురంలో ఎలా ప్రవేశిస్తాను? నేను వచ్చానని తెలిసి జనక మహారాజు వస్తే ఆయనకు నా ముఖం ఎలా చూపిస్తాను? సీత లేక నేను

బతికే మాట అబద్ధం. అందుచేత నన్నిక్కడే వదిలి నువ్వు అయోధ్యకు వెళ్ళు. భరతుణ్ణే రాజ్యం పాలించమన్నానని చెప్పు. నేనూ సీతా ఎలా నాశనమయ్యామో మా తల్లికి చెప్పు,'' అన్నాడు. రాముడి స్థితి చూసి లక్ష్మణుడు చాలా బాధపడ్డాడు.

చివరకు లక్ష్మణుడి ప్రోత్సాహంతో రాముడు సీతను మరింత ఓపికగా వెతకటానికి నిశ్చయించాడు. పరిసర ప్రాంతాలలో వెతుకుతూండగా ఒకచోట వారికి సీత ధరించిన పూలు నేలపై కనిపించాయి; వాటిని రాముడు గుర్తించాడు. మరికొంత దూరాన రాక్షసుడి అడుగులూ; సీత అడుగులూ కనిపించాయి; అక్కడనే సీత రావణుడికి అందకుండా పారిపోవ యత్నించింది. ఆ ప్రాంతంలోనే రక్తపు మరకలూ, విరిగిపోయిన రథమూ, గొడుగూ, గాడిదలూ, సారథి కళేబరమూ, బంగారు విల్లూ మొదలైనవి కనిపించాయి. ఆ రక్తం సీతదేననుకున్నాడు రాముడు.

అప్పటివరకూ రాముడికి రాక్షసులపైన ప్రత్యేకించి పగ లేదు; కాని ఆ క్షణంలో రాక్షసనిర్మూలనం చెయ్యాలనే నిశ్చయం అతనిలో ఏర్పడింది. ''నా సీతను నాకు వెంటనే ఇవ్వకపోతే మూడు లోకాలనూ ఒక్క బాణంతో భస్మీపటలం చేస్తాను,'' అని రౌద్రంగా అన్నాడు.

లక్ష్మణుడు రాముణ్ణి వారిస్తూ, ''ఈ యుద్ధం జరిగినచోట ఒక్క మనిషి అడుగు జాడలే ఉన్నాయి. ఒక్కడు చేసిన తప్పుకు మూడు లోకాలను శిక్షించటం అన్యాయం.



సీతను కాపాడడం ప్రధానం. ఎవడు సీతను అపహరించాడో వాడి కోసం అన్నిచోట్లా వెతుకుదాం,'' అన్నాడు.

ఇంతలోనే వారికి చావ సిద్ధంగా ఉన్న జటాయువు శరీరం ఎత్తుగా కనిపించింది. ''ఇదుగో, వీడే సీతను తినేసి హాయిగా కూచున్నాడు! వీడి ప్రాణాలు తీసేస్తాను,'' అంటూ రాముడు జటాయువుపై బాణం ఎక్కుపెట్టాడు.

''నాయనా, నన్ను రావణుడు చంపనే చంపాడు. నువ్వు మళ్ళీ ఎందుకు చంపుతావు? వాడు సీతను ఎత్తుకుపోతుంటే అడ్డుపడి వాడి వింటినీ, రథాన్నీ, గాడిదలనూ, సారథినీ ధ్వంసం చేశాను. వాడు కత్తితో నా రెక్కలు నరికేశాడు. తరవాత సీతను తీసుకుని ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు,'' అని జటాయువు చెప్పాడు.

ఈ మాటలు రాముడి చెవులకు శుభవార్తలాగా వినిపించాయి. ఎందుకంటే సీతను రాక్షసులు చంపి తినలేదు; ఆమెను ఎత్తుకుపోయిన వాడెవడో కూడా తెలిసింది. రాముడు తన విల్లును వదిలిపెట్టి జటాయువును కౌగలించుకుని దుఃఖించాడు. అతను జటాయువును, ''రావణుడికి నేనేమి అపకారం చేశాను? సీత నెందుకు అపహరించాడు? అతనుండే చోటేది? అతను ఎలా ఉంటాడు? ఎలాటి పరాక్రమం కలవాడు? వాడు తీసుకుపోతూ ఉంటే సీత ఏ స్థితిలో ఉన్నది? నాతో ఏమి చెప్పమన్నది? నీకు శక్తి ఉన్నట్టయితే నాకు సమస్తమూ సవిస్తరంగా చెప్పు,'' అని అడిగాడు ఆతృతగా.

కొనప్రాణాలతో ఉన్న జటాయువు, ''ఆ రావణుడు ఇలా దక్షిణంగా వెళ్ళాడు. వాడు కుబేరుడి తమ్ముడు,'' అ మాత్రం చెప్పి ప్రాణాలు వదిలాడు.

ఎంతో కాలం గొప్పగా జీవించి తన కోసం ప్రాణాలర్పించిన జటాయువుకు రాముడు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపాడు. పిండ ప్రదానానికి కేసరీ మృగమాంసం సంపాదించాడు. అనంతరం రామ లక్ష్మణులు గోదావరిలో స్నానాలు చేసి జటాయువుకు జల తర్పణాలు వదిలారు. తరవాత వారిద్దరూ జటాయువు చెప్పిన ప్రకారం సీతను వెతుకుతూ దక్షిణ దిశగా బయలుదేరారు.





# వెర్రివెంగళప్ప

వెంకప్ప అన్నదమ్ముల్లో ఆఖరివాడు. వాడికి అన్నలందరికంటే చదువు బాగా వచ్చింది. చాలా తెలివైనవాడని విద్య నేర్పిన గురువు అన్నాడు. కాని, చిన్నప్పటి నుంచీ వాడి ధోరణి ఎరిగిన అన్నలు మాత్రం, ''తెలివితేటలున్నా, వీడికి లోకజ్ఞానం లేదు. ఇలాంటివాడు రాజుగారి కొలువులో ఉద్యోగానికి తప్ప మరెందుకూ పనికిరాడు. వీడికి అక్కడ ఉద్యోగం వేయించు,'' అని తండ్రికి చెప్పారు.

ఇందుకు వెంకప్ప ఒప్పుకోక, తండ్రితో, ''రాజుగారి కొలువులో ఉద్యోగం చేయడం నా కిష్టమే. కాని, నేను అన్ని పనుల్లోనూ పనికివస్తానని తేలాకే, అక్కడికి వెళతాను. ఒక్కయేడాది నాకు వ్యవసాయం చేసే అవకాశం ఇవ్వు. నా శక్తిరుజువు చేస్తాను,'' అన్నాడు.

తండ్రి వాడికి అయిదెకరాల భూమి ఇచ్చాడు. వెంకప్ప మట్టిని పరీక్షించి, అందులో ఏది బాగా పండుతుందో నిర్ణయించి, ఆ పంట వేశాడు. వాతావరణంలోని మార్పులను శ్రద్ధగా గమనిస్తూ, తగిన జాగ్రత్తలు తీసుకున్నాడు. ఆ ఏడు వాడి పొలం విరగపండింది. అన్నలకంటె ఎక్కువ దిగుబడి సాధించాడు.

వెంకప్ప పంటనంతా అప్పటికప్పుడే అమ్మివేసి, డబ్బు చేసుకున్నాడు. బాగా సంపాయించానన్న ఉత్సాహంలో, కాస్త విలాసంగా ఖర్చు పెట్టాడు. ఆరు నెలలు గడిచేసరికి వాడి దగ్గిర డబ్బంతా అయిపోయింది. తిరిగి కొత్త పంట వేయడానికి పెట్టుబడికి గాను ఏమీ మిగలలేదు. అయితే, వాడికంటె తక్కువ భూమిలో, అంతకంటె తక్కువ పంట పండినవారు కూడా సుఖంగా వున్నారు.

ఇందుక్కారణం లేకపోలేదు. మిగతా వాళ్ళందరూ, మంచి ధర వచ్చేదాకా ఆగి పంట

25-ఏళ్ళనాటి చందమామ కథ



అమ్ముకున్నారు. పొలమంతా ఒకే పంట వేయకుండా, ఇంట్లోకి అవసరం అయిన ఇతరత్రా పంటలు కూడా వేశారు. వెంకప్ప మొత్తమంతా అమ్మివేయడం వల్ల, తనక్కా వలసిన తిండి గింజలు కూడా, తను అమ్మిన దానికిరెట్టింపు ధరకు కొనుక్కోవలసి వచ్చింది.

''వీడు వెర్రివెంగళప్పఅనిమేం ముందే చెప్పాం. తొందరగా వీడికి ఉద్యోగం వేయించు,'' అని అన్నలు తండ్రిని హెచ్చరించారు.

వెంకప్ప తండ్రి కాళ్ళు పట్టుకుని, ''వ్యవసాయం నాకు అచ్చిరాలేదు. అయినా, అది ఒంట్లో బలం వున్నవాళ్ళు చేయవలసినపని. నాకు బుద్ధిబలం వున్నది. నేను వ్యాపారం చేస్తాను. ఒకవెయ్యి వరహాలు ఇవ్వు,'' అని అడిగాడు. తండ్రి వాడికి వెయ్యి వరహాలు ఇచ్చాడు.

వెంకప్ప ఊళ్ళో ఏ వస్తువు ఎంత ధరకు అమ్ముడుపోతున్నదో చూశాడు. చుట్టుపక్కల ఆ వస్తువులు చవగ్గా దొరికే ప్రాంతాలేవో తెలుసుకున్నాడు. అక్కడి నుంచి సరుకు కొని తెచ్చి, ఊళ్ళో మిగిలినవాళ్ళకంటె కాస్త చవగ్గా అమ్మడం ప్రారంభించాడు. వాడి వ్యాపారం దినదిన ప్రవర్థమానమై పోయింది. మొదటి రెండు, మూడు మాసాల్లోనే తండ్రి వాడికిచ్చిన వెయ్యి వరహాలనూ, పదివేల వరహాలు చేశాడు.

అన్నలు తనను అందరివద్దా వెర్రివెంగళప్ప అంటారని వాడికి తెలుసు. అందుకని వెంకప్ప పనిగట్టుకుని ప్రతి వ్యాపారస్థుడి దగ్గిరకూ వెళ్ళి, ''ఈ రెండూ, మూడూ మాసాల్లో నా దగ్గిర డబ్బు పది రెట్లయింది. మీ అందరిక్కూడా అంత పెద్ద లాభాలు వస్తున్నయ్యా?'' అని అడిగాడు.

ఒక్క వ్యాపారి కూడా తనకు పెద్దగా లాభాలు వస్తున్నవని ఒప్పుకోలేదు. ''నీకు అంత పెద్ద లాభాలు ఎలా వస్తున్నయ్యో, మాకు అంతు చిక్కడం లేదు. అతి కష్టం మీద, మా పెట్టుబడి మాకు తిరిగి వస్తున్నది,'' అన్నారు వాళ్ళు.

వెంకప్ప ఆశ్చర్యపోయి, తనంత తెలివైన వాడు లేడనుకున్నాడు. సంపాయించిన డబ్బును ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టేవాడు. నెలకు ఒకవెయ్యి రూపాయలు దాచగలిగితే చాలునని వాడి అభిప్రాయం.

ఆరు మాసాలు గడిచాక ఉన్నట్టుండి వెంకప్ప దగ్గిరకు, రాజుగారి పన్నులు వసూలు

చేసే అధికారి వచ్చి, ''వ్యాపారంలో నీకు ఇటీవల బాగా లాభాలు వచ్చాయి కదా?'' అని అడిగాడు.

''అవును. ఈ ఊళ్ళో ఎవరికీ రానంతగా వచ్చాయి,'' అన్నాడు వెంకప్ప.

''నీ లాభాల సంగతి, నా దాకా వచ్చింది. నువ్వు, రాజుగారికి ముప్పైవేల వరహాలు పన్నుగా చెల్లించవలసి వున్నది,'' అన్నాడు అధికారి.

''పన్నేమిటి?'' అంటూ ఆశ్చర్యపోయాడు వెంకప్ప.

''నీకు వచ్చిన లాభాల్లో ముప్పైశాతం రాజుగారికి పన్నుగా కట్టాలి. ఇంతవరకూ నీకు లక్షవరహాలు లాభం వచ్చింది. అంటే, ముప్పైవేల వరహాలు పన్నుకట్టాలి. నీలాగే మిగతా వ్యాపారులు కూడా పన్నుకట్టాలి. త్వరగా పన్ను చెల్లించు,'' అన్నాడు అధికారి.

వెంకప్పకు గుండె ఆగినంతపనైంది. తను మళ్ళీ తండ్రి దగ్గిర అప్పు చేసి, ఈ పన్ను చెల్లించాలి. మిగతా వ్యాపారులు లాభాలు రావడంలేదని ఎందుకన్నారో, వాడికప్పుడు అర్థమైంది.

వెంకప్ప తండ్రి, పన్నులు వసూలు చేసే అధికారికి సర్దిచెప్పి పంపేసి, ''నీ అన్నలు చెప్పినట్టు, నువ్వు నిజంగా వెర్రివెంగళప్పవే! మనం రాజధానికి వెళదాం, అక్కడ నీకు ఏదో ఒక ఉద్యోగం ఇప్పిస్తాను,'' అన్నాడు వెంకప్పతో. వెంకప్ప అవమానంతో తల వంచుకుని, ''నా ఉద్యోగం నేను సంపాయించుకోగలను. వ్యాపారంలాంటి అబద్ధాలు పలకవల



సిన వృత్తిలో నేను రాణించలేకపోవచ్చు. కాని, నా తెలివితేటలతో రాజుగారిని మెప్పించగలను,'' అన్నాడు.

తండ్రి ఒక క్షణం ఆలోచించి, ''సరే, అలాగే చెయ్యి. ఒక విషయం మాత్రం గుర్తుంచుకో! ఎంత గొప్పవాళ్ళకైనా సరాసరి వెళ్ళగానే రాజదర్శనం లభించదు. ఎవడైనా గొప్పవాడి ద్వారా రాజుగారి ప్రాపకం సంపాయించుకో. నీవల్ల పని కాకపోతే మాత్రం, నాకు కబురు చెయ్యి. వచ్చి సాయం చేస్తాను,'' అన్నాడు.

వెంకప్ప రాజధానీనగరం చేరాడు. ఆ రోజు రాజుగారు మహాకవి అప్పన్నకు కనకాభిషేకం చేస్తున్నాడు. జనం తండోపతండాలుగా వెళుతున్నారు. ఆ విశేషం చూడ్డానికి వెంకప్ప కూడా వెళ్ళాడు.

రాజ్యంలోని ప్రముఖులందరూ మహా కవికి ప్రణామాలు చేయడం వెంకప్ప చూశాడు. రాజు స్వయంగా ఒక పళ్ళెం నిండా బంగారు నాణాలు తెచ్చి, పురోహితులు మంత్రపఠనం చేస్తూండగా, అప్పన్నను అభిషేకించి, పాదాభివందనం చేశాడు. అప్పన్న రాజును ఆశీర్వదించాడు. జయ జయ ధ్వానాలతో సభ దద్దరిల్లి పోయింది.

ఆ సాయంత్రం వెంకప్ప, మహాకవి అప్పన్నను చూడబోయాడు. ఎంతో సులువుగా వాడికి, ఆయన దర్శనం లభించింది. వెంకప్ప ఆయనకు వినయంగా నమస్కరించి, ''నా తెలివి తేటలు ప్రదర్శించే అవకాశం ఇస్తే, ఎంతటివారినైనా మెప్పించగలను. మీ మాట సాయంతో, నేను రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించుకోవాలనుకుంటున్నాను,'' అన్నాడు.

అప్పన్న ఆశ్చర్యపోయి, ''నాయనా, నువ్వెవరివో గాని వెర్రివెంగళప్పలాగున్నావు. అలా కాకపోతే, కొలువులో ఉద్యోగం కోసం నా దగ్గిరకు రావు,'' అన్నాడు.

వెంకప్ప చిన్నబుచ్చుకుని, ''అంతా అన్నట్టే, మీరూ అన్నారు! రాజుగారి చేత కనకాభిషేకం చేయించుకున్న మీకంటె గొప్పవారు, నాకెక్కడ దొరుకుతారు?'' అన్నాడు.

అప్పన్న నవ్వి, ''వెర్రివాడా, ఈ సంగతి తెలియదా? ఒక కవిని సన్మానించడం రాజుకు గౌరవకారణం అవుతుంది. అందుకే ఆయన నాకు కనకాభిషేకం చేశాడు. అంతకంటె ఆయనకు నా మీద ప్రత్యేకాభిమానం అంటూ ఏమీ లేదు. ఉద్యోగం కావాలంటే మంత్రి దగ్గిరకు వెళ్ళు, సేనాధిపతి దగ్గిరకు, విదూషకుడి దగ్గిరకు వెళ్ళు. ఆఖరికి ఆయనగారి క్షౌరకుడూ, రజకుడూ అయినా, నీకు సాయపడవచ్చు. సన్మానం ముగిశాక, నే నెవరినో కూడా రాజుకు గుర్తుండక పోవచ్చు,'' అన్నాడు.

వెంకప్పకు ఈ ప్రపంచమంతా అయోమయం అనిపించింది. వాడు, తండ్రికి కబురు పంపి, ఆయన ద్వారా రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాదించి, అనామకుడుగా చాలా కాలం సుఖంగా జీవించాడు.



# అజేయుడు గరుడుడు!




ఆదిత్యుణ్ణి ఉన్నట్టుండి ఒక దివ్యకంఠస్వరం హెచ్చరించింది.

శత్రువులు నీ మీదికి వస్తున్నారు.

దేవా! తప్పించుకుని వెళ్ళమని మాత్రం నన్ను ఆజ్ఞాపించకండి.

దుర్మార్గులను ధైర్యంగా ఎదుర్కొనే శక్తులను ప్రసాదించండి.

ఆదిత్యుడికి ఇప్పుడు దేవత మృదువైన కంఠస్వరం వినిపించింది.

నాయనా, నువ్వు దుష్టులను పరిమార్చాలన్నదే నీ దేవుడి సంకల్పం.

గరుడ మందిరంలోకి వెళ్ళు. అక్కడ నీకొక మహత్తర సందేశం ఉన్నది.

ఆదిత్యుడు గరుడ మందిరంలో అడుగుపెట్టగానే, అతన్ని వేనవేల కిరణాలు చుట్టుముడుతూన్న అనుభూతి కలిగింది. అతడు అక్కడే నిలబడ్డాడు.

నాలో ఏదో వింతశక్తి ప్రవేశిస్తున్నది.


కొన్ని సంవత్సరాల క్రితం కలిగిన అటువంటి అనుభూతి, ఆదిత్యుడికి జ్ఞాపకం వచ్చింది.
నా చుట్టూ ఈక పదేపదే పరిభ్రమించడం గమనించాను.


హఠాత్తుగా నాలో ఏదో మార్పు వచ్చింది.


దేవా! గరుడదేవా!


ఆదిత్యా!
నీ అతీత శక్తులను ఆహ్వానించు. నువ్వు భీకర దుష్టశక్తులను ఎదుర్కొనేప్పుడు అవి పరిపూర్ణ రూపాలతో సాక్షాత్కరిస్తాయి.


ఆదిత్యుడు, విడిది భవనంలో కలిగిన ఆధ్యాత్మిక అనుభూతిని స్మరించుకున్నాడు.
ముందుకు అడుగు వెయ్! నాయనా! నాగబంధు దుష్టశక్తుల విజృంభణ నుంచి దేవదేవుడి సృష్టిని పరిరక్షించు!

గరుడుడి శక్తివంతమైన రెక్కలు తనకు వచ్చినట్టు ఆదిత్యుడు అనుభూతి పొందాడు.

బలమైన ముక్కుగల శిరస్త్రాణం, దృఢమైన కాళ్ళు...

ఆదిత్యుడు గరుడ రూపాన్ని పొంది దేవదేవుడికే ప్రణమిల్లాడు.

నాగబంధు దుష్ట శక్తులను నువ్వు ఒంటరిగా ఎదుర్కోవడం లేదు. నీకు అండగా నా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి.

ఆదిత్యుడు ఆ అద్భుత అనుభూతి నుంచి బయటపడ్డాడు.

ఇక, కార్యరంగంలోకి ఉరకాలి! దేవా! నన్ను ఆజ్ఞాపించు!

సూర్యపురి సేనలు ఆలయాన్ని చుట్టుముట్టాయి.

వాళ్ళ నాయకుల్లాంటివాడు ఆలయాన్ని సమీపించాడు.

మీరెవరైనా సరే, ఆలయంలోకి వెళ్ళకూడదు.

దయచేసి వెళ్ళి పొండి. లోపల కొన్ని ముఖ్యమైన పూజలు జరుగుతున్నాయి.

ద్వారపాలకులకూ, సైనికులకూ మధ్య కొంత తోపులాట జరిగింది.

నేను సూర్యపురి సేనాధిపతి ధీరసేనుణ్ణి! దారి వదలండి!

నాయకుడు బలవంతంగా తలుపులు తెరిచి లోపల అడుగుపెట్టాడు.

ఏమిటిది? ఇక్కడ ఒక్కరూ లేరే!

హఠాత్తుగా బలమైన తలుపులు పెద్ద శబ్దంతో దభీమని మూసుకున్నాయి.

ఏమిటి! ఎవరు?

-(ఇంకావుంది)

# సుందర్‌బన్స్



అడవులనెలా వారసత్వ ప్రదేశాలుగా ప్రకటించవచ్చని చాలా మందికి అనుమానం కలగవచ్చు. అయితే పశ్చిమ బెంగాల్‌లోని సుందర్‌బన్స్ మామూలు అడవులు కావు. ఇది దాదాపు 10,000చ.కి.మీ. నేలా, నీరూ విస్తరించిన ప్రపంచంలోనే అతి పెద్ద మాంగ్రూవ్ అడవి. గంగ, బ్రహ్మపుత్ర, మేఘన అనే మూడు మహా నదుల ముఖద్వారంలో ఏర్పడిన అతి పెద్ద డెల్టా ప్రాంతం (80,000చ.కి.మీ) ఇది. సుందర్‌బన్స్ అంతా చిన్నా పెద్దా కాలువలు ఒకదానితో ఒకటి కలుపబడి ఉన్నాయి. పెద్ద కాలువలు మైలు కన్నా ఎక్కువ వెడల్పుతో ఉంటాయి. ఈ ప్రాంతంలో 54 చిన్నచిన్న దీవులు ఉన్నాయి. అక్కడ రకరకాల మొక్కలు, చెట్లు ఉన్నాయి.

1878వ సం.లో సుందర్‌బన్స్ పరిరక్షిత ప్రాంతంగా ప్రకటించబడింది. మన జాతీయ మృగం పులి. రాయెల్ బెంగాల్ టైగర్స్ అనే ప్రత్యేక పులులకు నివాస స్థానం కావడంతో 1977లో వన్య మృగ అభయారణ్యంగా చేయబడింది. 1984లో ఇది జాతీయోద్యానంగా మార్చబడింది. ఆ సమయంలో అక్కడి పులుల సంఖ్య 265. అడవి పందులు, చుక్కల జింకలు మొదలైన జంతువులు, నల్లమెడ కొంగల వంటి రకరకాల పక్షులు, డాల్ఫిన్‌లాంటి జలచరాలు ఉన్నాయి.

అడవిని ప్రధానంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. మొదటిది దిగువ మాంగ్రూవ్ ఉప్పునీళ్ళ సముద్ర తీర అరణ్యం. రెండవది ఇసుకదిబ్బలు, చెట్టుచేమలు నిండిన ఎగువ ప్రాంతం.

1987 ఏప్రిల్‌లో సుందర్‌బన్స్‌ను ప్రపంచ వారసత్వ జాబితాలోకి తీసుకున్నారు. ''రకరకాల మొక్కలతో, విభిన్న జీవరాశులతో అరుదైన జీవవైవిధ్యంగల ప్రపంచంలో మిగిలివున్న అతి పెద్ద మాంగ్రూవ్ అడవి,'' కావడమే దీనిని వారసత్వ జాబితాలోకి తీసుకోవడానికి ప్రధాన కారణం అని పేర్కొన్నారు.



## క్యాలండర్‌లో ముద్రించబడిన చిత్రం

బ్రిటిష్ కౌన్సిల్ చెన్నయ్‌లో గ్లోబల్ యెంగ్ లర్నర్స్ ఆర్ట్ కాంపిటీషన్ నిర్వహించింది. స్థానిక లేడీ ఆండాళ్ వి.ఎస్.రావు మెట్రిక్యులేషన్ స్కూల్ విద్యార్థిని ఎనిమిదేళ్ళ సి. నిష్యందిని ఆ పోటీలో పాల్గొని ఒక 'తోట'ను చిత్రించింది. ఆ చిత్రాన్ని తమ 2007 క్యాలండర్‌లోనూ, డైరీలోనూ ముద్రించడానికి కౌన్సిల్ తీసుకున్నది. ఇతర దేశాలకు చెందిన విద్యార్థులు చిత్రించిన చిత్రాలను కూడా వాటిలోకి తీసుకున్నారు. డ్యూక్ ఆఫ్ యార్క్ ప్రిన్స్ ఆండ్రూ నుంచి నిష్యందిని సర్టిఫికేట్, క్యాలండర్, డైరీలను అందుకున్నది.

## అతిపిన్నవయసులో పదవ తరగతి ఉత్తీర్ణత



గత మార్చ్‌లో పరీక్షరాస్తున్నప్పుడు అంతమంది పత్రికల ఫోటోగ్రాఫర్లు వచ్చి, తనను ఫోటో తీయడం ఏడేళ్ళ సుష్మకు చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆమె అప్పుడు రాస్తున్నది 10వ తరగతి పరీక్షలు. లక్నోలోని సెయింట్ మీరా ఇంటర్-కాలేజ్ స్కూల్లో చదువుతున్న సుష్మ గత సంవత్సరం తొమ్మిదో తరగతి ఉత్తీర్ణురాలై ఈయేడు పదవ తరగతి పబ్లిక్ పరీక్షలకు హాజరు కావడానికి అర్హత సాధించింది. పరీక్షలలో నెగ్గి, పదవ తరగతి ఉత్తీర్ణురాలైన అతిపిన్నవయసు విద్యార్థినిగా పేరు తెచ్చుకున్నది.

---

### చందమామ ఇండియా క్విజ్ - 6 (జూలై '07)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం. చందమామ ఇండియా క్విజ్-6 సమాధానాలు 44వ పేజీలో ఇవ్వబడ్డాయి.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....




విజ్ఞాన వీచికలు :

## ఉసిరిక ఔషధ గుణాలు

ఆగ్నేయాసియాకు చెందిన ఉసిరిక ఔషధ గుణాల గురించి ఆయుర్వేదంలో అధికంగా ప్రస్తావించబడింది. దండకారణ్యం పంచ వటి ప్రాంతంలో శ్రీరాముడు తమ పర్ణశాల ముందు నాటిన ఐదు మొక్కలలో ఉసిరిక ఒకటి అని రామాయణం చెబుతుంది. సంస్కృతంలో దీనిని అమ్ల వృక్షం అని అంటారు.

ఉసిరిక చెట్లు చిన్న చిన్న ఆకులతో దట్టంగా ఉంటాయి. కాయ పచ్చగానూ, పండినప్పుడు పసుపు పచ్చరంగుతోనూ గట్టిగా నిగనిగలాడుతూ ఉంటుంది. పండు పుల్లగా ఉంటుంది. ఉసిరిక తిన్నాక నీళ్ళు తాగితే తియ్యగా ఉండడం మన పిల్లలందరికీ తెలిసిన విషయమే. ఉసిరికలో సి విటమిను పుష్కలంగా ఉంది.

అనేక వ్యాధులకు ఆయుర్వేదం ఉసిరికను ఔషధంగా సూచిస్తుంది. ఉసిరిక శరీరానికి చలవ చేస్తుంది. దీనిని ఆకలి పుట్టించడానికీ, వాంతులను అరికట్టడానికీ ఉపయోగిస్తారు. బలవర్ధకంగానూ వాడతారు. దీనిని సక్రమంగా తీసుకోవడం ద్వారా మధుమేహం, సాధారణ జలుబు, దగ్గు, ఉబ్బసం మొదలైన రుగ్మతలను నయం చేయవచ్చునని ఆయుర్వేద వైద్యులు చెబుతారు.

మన పరిసరాలు

## పోర్చుగీసు మేన్-ఆఫ్-వార్



ఇది పేరుకు మేన్-ఆఫ్-వార్ తప్ప, యుద్ధాలకూ దీనికీ ఎలాంటి సంబంధమూ లేదు. ఇదొకసముద్ర ప్రాణి. 30 సెం.మీ. పొడవు, 15 సెం.మీ. వెడల్పుతో పడవలాంటి శిఖతో ఉంటుంది.

18 శతాబ్దం ప్రాంతంలో నావికులు కొందరు ఈ ప్రాణిని చూసి అది పోర్చుగీసు యుద్ధనౌకను గుర్తుచేసే విధంగా ఉందనుకున్నారు. అందుకే దానికాపేరు వచ్చింది. నీళ్ళకు పైన దాని శిఖభాగం మాత్రం కనిపిస్తుంది. కింది భాగంలో 'పోలిప్స్' అనే ప్రాణులదండు మీసాల్లా వేలాడుతూ ఉంటాయి. పెద్దవి ఆహారాన్ని పట్టుకుంటే చిన్నవి దాన్ని తిని జీర్ణం చేస్తాయి. శిఖ మీద వాయువునింపిన తిత్తిలాంటి భాగం ఆ ప్రాణి నీటి మీద తేలడానికి ఉపయోగపడుతుంది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



J KARTHIK

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

జూలై నెల పోటీ ఫలితాలు
శ్రీమతి దుర్గా ఉమా మహేశ్వరి
భ.పే: పి.ఎ. భాస్కరరావు
6-3-252/1/3/ఎ
తాజ్ కృష్ణ రోడ్, ఎర్రమంజిల్ కాలనీ
హైదరాబాద్ - 500 082

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : చెప్పలేని ఆనందం!
రెండవ ఫోటో : చేతికర్ర ఊతంతో!!

## సమాధానాలు :

1. జి. శంకర కురుప్-మలయాళంలో.
2. కాశ్మీరు రాజుల చరిత్ర-రాజతరంగిణి 3. కాళిదాసు.
4. జవహర్‌లాల్ నెహ్రూ 5. శ్రీ అరవిందులు; సావిత్రి.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)

# శీతల ఆహార పదార్థాలు వేడి చేసేప్పుడు...




తొమ్మిదేళ్ళ ప్రదీప్‌కు 'పనీర్ మఖానీ' అంటే చాలా ఇష్టం. ఒక రోజు ఉదయం పూట ప్రదీప్ తల్లి వాడి లంచ్ కోసం పనీర్ మఖానీ చేసింది. లంచ్ బాక్స్‌లో పెట్టాక, మిగిలిన దాన్ని చిన్న గిన్నెలో వేసి రెఫ్రిజిరేటర్‌లో భద్రపరిచింది. ప్రదీప్ సాయంకాలం బడినుంచి తిరిగి వచ్చీరాగానే, ''అమ్మా, పనీర్ మఖానీ చాలా బావుంది. రాత్రికి కూడా కొంచెం పెడతావా?'' అని అడిగాడు. ''తప్పకుండా,'' అంటూ నవ్వింది వాడి తల్లి. కొంతసేపయ్యాక ప్రదీప్ నీళ్ళు తాగడానికి వంట గదిలోకి వెళ్ళినప్పుడు, వాడి తల్లి ఫ్రిడ్జ్ నుంచి పనీర్ మఖానీని వెలుపలికి తీయడం చూసి, ''ఇంకా భోజనం వేళ కాలేదు కదమ్మా?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''నిజమే ప్రదీప్,'' అన్నది తల్లి. ''మరి, పనీర్ మఖానీని అప్పుడే ఎందుకు బయటకు తీస్తున్నావు?'' అని అడిగాడు ప్రదీప్. ''లేదు, నేనిప్పుడు దీన్ని వేడి చేయడం లేదులే. తరవాతే చేస్తాను. వంట గ్యాస్ సప్లై అంతంత మాత్రంగానే వుంది కదా? వంట గ్యాస్‌ను ఎల్‌పిజి అంటారు. అంటే లిక్విఫైడ్ పెట్రోలియం గ్యాస్. దాన్ని మనం వృథాచేయకుండా చాలా పొదుపుగా వాడుకోవాలి. ఫ్రిడ్జ్ నుంచి తీసిన ఆహార పదార్థాలను వెంటనే వేడి చేస్తే, అవి మరీ చల్లగా ఉండడంవల్ల వేడెక్కడానికి ఎక్కువ సేపు పడుతుంది. గ్యాస్ వృథా అవుతుంది. అందువల్ల ఫ్రిడ్జ్‌లో ఉంచిన శీతల ఆహార పదార్థాలను వేడి చేయాలనుకున్నప్పుడు వాటిని కాస్త ముందుగానే తీసి బయట పెట్టాలి. అవి గది ఉష్ణోగ్రతకు వచ్చాక వేడి చేశామనుకో, తొందరగా వేడెక్కుతాయి. ఆ విధంగా వంటగ్యాస్ ఆదా అవుతుందన్న మాట!'' అని వివరించిందామె.

''రుచిగా వంట చేయడం మాత్రమే కాదు. వంట గ్యాస్ పొదుపు చేయడంలో చాలా కూడా తెలివైనది మా అమ్మ'' అంటూ ప్రదీప్ నవ్వాడు.

CHANDAMAMA (Telugu) Sep 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08